Regd No. N. 45 / M 3813

వెల ఒక అణా

★ బ్రిటిషు సేనలు సిరియా జొచ్చుట ★

# గోలకొండపత్రిక

★ సైప్రసువద్ద జర్మనుల మందుగసులు ★

ప్రతి సోమ, గురు వారములందు వెలువడు జాతీయ పత్రిక

2564

సంపుటము ౧౬ హైద్రాబాదు-దక్కన్ శా. శ. ౧౮౬౩ వృషసం॥ర జ్యేష్ఠ బ॥ ౩ (౭-౬-౧౩౫౦ ఫ.) గురువారము సంచిక ౧౨

# సిరియాలో బ్రిటిషు మిత్రమండలి సేనలు చొచ్చుట

## విషీ ఫ్రెంచిప్రభుత్వము ఆ సేనలతో పోరాడ నిశ్చయించుట

ఉచిత డీగాల్ గారి ఫ్రెంచిసేనలు బ్రిటిషు సామ్రాజ్య సేనల సహాయముతో జూను రావతేది ఉదయము సిరియా, లెబనానులలో ప్రవేశించినవి- ఈ సేనలు పాలెస్టయిను, ట్రాన్స్జోర్డన్, ఇరాఖులనుండి ప్రవేశించినవి. సేనలు క్రిందనడచిపోవుచుండ వాటికి సైనరక్షణగా బ్రిటిషువిమానములు నడచుచుండినవి. బ్రిటిషువిమానములనుండి క్రిందికి కొన్ని కాగితములు వెదజల్లబడినవి. ఆ కాగితములలో సిరియాలోకి ఈ సేనలు ప్రవేశించుటకు కారణములు వివరించబడినవి. ఈ కారణములు బ్రిటిషుప్రభుత్వమువారును, డీగాలుగారి సేనలను నడిపించుచుండిన జనరల్ కాట్రూగారును జూను రావతేదిన చేసిన ప్రకటనలలో విశదముగా తెలుపబడినవి. ఈ సేనలు సిరియా, లెబనానులలోని ప్రజలపై యుద్ధము చేయుటకు వచ్చుచుండుటలేదనియు, సిరియాలో అంతకంతకు తమ అధికారము పాదుకొనిపోవునట్లు చేయుచున్న జర్మనులను తరిమివేయుటకై వచ్చుచున్నవనియు, అందువల్ల సిరియా లెబనానుల ప్రజలు బ్రిటిషు మిత్రమండలి సేనలను ప్రతిఘటించకూడదనియు, అట్లు ప్రతిఘటించక బ్రిటిషు మిత్రమండలి పక్షమున చేరి పోరాడినచో, బ్రిటిషువిజయానంతరము వీలైనంతత్వరలో సిరియా, లెబనాను ప్రజల ప్రతినిధులతో జనరల్ కాట్రూగారు ఒక సంధిని చేసికొనగలరనియు, ఆ సంధిచే సిరియా లెబనానులు స్వతంత్రరాజ్యములుగా స్థిరపడుటయు, వాటితో డీగాల్ పక్షంవారును, బ్రిటిషువారును తమతమ సంబంధము లెట్లుండవలసినదియు సంధిపత్రమందే నిర్ధారణజేసికొనబడుటయు జరుగగలదనియు, ఈవిధముగా స్వాతంత్ర్యముపొందిన సిరియా లెబనానులు పొరుగురాజ్యములతో సంబంధములు గల (అనగా బ్రిటిషువారితో మైత్రియొనర్చిన స్వాతంత్ర్యము పొందగల) రాజ్యములతో వ్యాపారమును సాగించుకొనవచ్చుననియు ఆ ప్రకటన లన్నిటిలోను వాగ్దానము చేయబడినది. జర్మనులు సిరియాలో అధికారము స్థాపించుకొన్నచో చుట్టుప్రక్కలనుండి టర్కీ, పాలెస్టయిను, ఇరాకులనుకూడ లొంగదీసుకొనుటకు యత్నించగలరనియు, అరబ్బులకు బ్రిటిషువారు ఇచ్చిన అభయవచనములను నెరవేర్చుటకై సిరియాలోకి జర్మనులను చేరనీయకుండ ప్రయత్నించుట అవసరమగుచున్నదనియు ఆ ప్రకటనలలో చెప్పబడినది. కాబట్టి సిరియా, లెబనానుల ప్రజలు తమ సేనలను ప్రతిఘటించక, విషీలోని ఫ్రెంచిప్రభుత్వాజ్ఞల నుల్లంఘించి తమకు తోడ్పడవలసినదని జనరల్ కాట్రూగారు కోరినారు. మధ్యప్రాచ్యఖండములోని బ్రిటిషు సేనల ప్రధానాధిపతియగు జనరల్ వేవెల్ గారు సిరియాలోని ఫ్రెంచి సైనికులకు ఇచ్చిన సందేశములో కూడ కాట్రూగారిమాదిరిగానే బ్రిటిషు సేనలకు తోడ్పడవలసినదనియు, ఈ సేనలు వారలపై శత్రువులవలె యుద్ధము చేయుటకుగా, వారల స్వాతంత్ర్యము నపహరించుటకు యత్నించుచున్న జర్మను సేనలను సిరియా, లెబనానులనుండి తరిమివేయుటకే వచ్చుచున్నవనియు చెప్పి తుదకీ బెదరింపుతో ముగించినారు "మేము గొప్పబలముతో వచ్చినాము అందువల్ల మీరు తిరుగుబాటుచేసినను ప్రయోజనము ఉండదు."

మధ్యప్రాచ్య సేనల ప్రధానకార్యస్థానమునుండి వెలువడిన ఇంకొక ప్రకటనలో ఫ్రెంచివారును, అరబ్బులును బ్రిటిషు మిత్రమండలి సేనలతో చేరి పోరాడగలరని ఆశించుచున్నామని చెప్పబడినది జనరల్ డీగాల్ గారుకూడ ఇదేవిధంగా ప్రకటన గావించినారు.

మే ౧౫వతేదిన మార్షల్ పెటెయిన్ గారును అడ్మిరల్ డార్లన్ గారును అత్యవసరముగ సమావేశమై ఆలోచించిరి. తర్వాత పెటెయిను గారు ఫ్రాన్సుకు పూర్వమునుండి ఉంటున్న సామ్రాజ్యమును విచ్ఛేదముకాకుండ రక్షించుటకై సిరియాలోని ఫ్రెంచిసేనలు పోరాడదగునని ఒక విజ్ఞప్తిని ప్రకటించిరి. సిరియాను తమ సేనలబలమున్నంతవరకు రక్షించెదమని విషీ ప్రభుత్వమువారొక ప్రకటనగావించినారు.

ఇపుడు సిరియాలో బ్రిటిషుమిత్రమండలి సేనలు బేరూట్, అలెప్పో, దమాస్కసులవైపు నడచిపోవుచున్నవి. దమాస్కసుకు దక్షిణంలో ఈ సేనలకు తీవ్రప్రతిఘటన సంభవించినది- ఈ సేనలు లెబనాన్ సముద్రతీరంవద్ద మెర్జిఅయూనునుండి జెబెల్ డ్రూజ్ దేశపు దక్షిణపుకొసవరకు వ్యాపించియున్నవి- ఈ జెబెల్ డ్రూజ్ వద్ద ఘోరముగా పోరాటములు జరిగినవట- మొదటిరోజునసే బ్రిటిషుమిత్రమండలి సేనలు డెరా, మెర్జాన్, సైరీలలో ప్రవేశించినవి. ఈ సేనలను జనరల్ విల్సను అను బ్రిటిషు సేనాని నడిపించుచున్నాడు- సిరియాలోని ఫ్రెంచిసేనలను అక్కడి ఫ్రెంచి హైకమిషనరగు జనరల్ డెంట్జ్ గారే నడిపించబూనినారు- ఇపుడు ఈ ఫ్రెంచిసేననుండి రవేలమంది ఆధునిక యుద్ధపరికరములతో బ్రిటిషుపక్షమునకు పోయి చేరినారట-

బ్రిటిషుయుద్ధనౌకలుగూడ పనిచేయుచునే యున్నవి- బేరూట్ వద్ద ఈ యుద్ధనౌకలనుండి సేనలు దింపబడినవట- మధ్యధరా సముద్రంలో సిరియా సముద్రతీరంనుండి కాల్పబడు ఫిరంగులగుండ్ల దెబ్బలు తాకునంతదూరంలో బ్రిటిషుయుద్ధనౌకలు సంచారము చేయుచునేయున్నవి-

బ్రిటిషువిమానములుగూడ సిరియాలో శత్రుస్థానములని యనుమానమున్న చోట్లపై బాంబులను వేయుచునేయున్నవి- జూను ౫వతేదిన యవి అలెప్పో విమానాశ్రయముమీదను, ౯వతేదిన బేరూటుమీదను, మెజీవిమానాశ్రయము మీదను బాంబులను వేసినవి

జర్మనులు సిరియాలో ఎక్కువగ చేరుచున్నారని బ్రిటిషువారివార్తలలో చెప్పబడుచున్నది: కాని సిరియాలో ఫ్రెంచిప్రభుత్వపు హైకమిషనర్ అగు జనరల్ డెంట్జ్ గారు మాత్రము ఏవో చెడిపోయినందువల్ల దిగిరి పేరి చేసుకొనబడుచున్న రెండుమూడు జర్మనువిమానములు తప్పితే మరే జర్మనులును సిరియాలో దిగలేదని ప్రతిసారియు ఖండన చేయుచున్నారు బ్రిటిషు వారినుండివచ్చేవార్తలు సిరియానంతటిని ఆక్రమించుకొనుటకు పెద్దఎత్తు చేయుచున్నారని ఇంకను చెప్పబడుచునే యున్నది. సిరియాలో నిలటాకియా రేవును జర్మనులు పెద్ద హార్బరుగా చేయుచు దానిసమీపంలో పెద్దవిమానాశ్రయమును నిర్మించుచున్నారట, దమాస్కస్, పల్మైరా, అలెప్పోలలోని విమానాశ్రయములు జర్మనుల వశములోనున్నవట అక్కడినుండి ౨౦౦ జర్మనువిమానములు పనిచేయుచున్నవట ఇక్కడి విమానము లిపుడు రాఖకు మార్చబడినవి మరియు జర్మను విమానములు సిరియా రోడ్సుల మధ్య నిరంతరము తిరుగుచున్నవట. బేరూట్ హార్బరులో జర్మనుజలాంతర్గాములు కూడ కనిపించినవట. ఇపుడు సాలొనికాలో ఉండే ఒక జర్మను సైనికభారవాహ నౌక జూను ౧ంవతేదిన బయలుదేరి ౧ంవతేదిన బేరూటు చేరునది, అలెప్పో, పల్మైరా, దమాస్కసులలోకూడ విమానాశ్రయములు పెద్దవి చేయబడుచున్నవట, సిరియాలో రేడియోలను కూడ లొంగదీయుటకు జర్మనులు సిద్ధపడుచున్నారట కాబట్టి ఈవిధంగా సిరియాలో జర్మనులు తమకు త్రొక్కి నిలవకుండునట్లు చేయుటకై బ్రిటిషువారు డోడెకనీస్ నుండి సిరియావరకు నౌకాసంబంధము లైనవిమానములను కాపలాగా ఉంచియున్నారు,

జర్మనుల అధికారుల ప్రేరణచే సిరియాలోని ఫ్రెంచి అధికారులు కూడ సైనిక విమానాశ్రయములను వృద్ధిచేయుటకు ప్రారంభించినారు అమ్మాన్ మీద ఫ్రెంచివిమానాలు బాంబులు వేసినవని ఒక వార్త గతసంచికలో ప్రకటించబడి యుండెనుగదా అది జర్మనుల చే వ్యాపింపజేయబడినదే గాని అందు నిజమేమియు లేదని ఇపుడు బ్రిటిషువారివార్తలు తెలుపుచున్నవి,

బ్రిటిషువారు సిరియాలోకి తమసేనలను పంపించుటకై కొన్ని వారములనుండియే సన్నాహములు పాలెస్టయినులో చేసియుండిరని ఇపుడు బయటపెట్టబడినది. ఇపుడు బ్రిటిషువార్తలు తెల్పుచున్న మరికొన్ని విశేషాలిట్లున్నవి. జూను ౧౫వతేదిన కొందరు జర్మనుఅధికారులు అలెప్పోకు చేరి సిరియాపరిపాలనాధికారమునంతయు స్వీకరింతురని విషీలోని ఫ్రెంచిప్రభుత్వమువారు సిరియాపై కమిషనరగు జనరల్ డెంట్జ్ గారికి ఇటీవలనే తెలియబరచియుండిరట అడ్మిరల్ డార్లాను గారు హిట్లరుతో సంభాషణలలో సిరియాలోని విమానాశ్రయములను జర్మనులు ఉపయోగించుకొనుటకు ఒప్పుకొనిరని డెంట్జ్ గారికి తెలుపబడినదట- డెంట్జ్ గారిని అడిగిన ప్రశ్నలకు సమాధానముగ వారు జర్మనులు అవిమానాశ్రయములవద్ద స్థావర మేర్పరచుకొనకుండ ప్రయాణమధ్యలో ఆగుటకు వాడుకొనవచ్చునని తెలిపిరి.

మే ౩౧వతేదిన అడ్మిరల్ డార్లాను గారు పెటెయిను గారికి సమర్పించుకొన్న ఒక పత్రములో ఫ్రెంచినౌకలను ఫ్రెంచిరేవులను నిష్కారణమైన బ్రిటిషు దెబ్బలనుండి రక్షించుటకు ఫ్రెంచిప్రభుత్వమువారు ఏర్పాటులు చేయవలెనని చెప్పబడినది. మధ్యధరాసముద్రంలో బ్రిటిషునౌకలతో పోరాడుటకు ఫ్రెంచినౌకలను పంపవలెననికూడ వారు కోరినారు దీనివల్ల అమెరికాకు కోపము వచ్చినను సరేనని వారు సిద్ధపడినారు. విషీలో అమెరికా సంయుక్తరాష్ట్రప్రభుత్వపు రాయబారియగు అడ్మిరల్ లీహీగారు జూను ౯వతేదీన అడ్మిరల్ డార్లానుగారి సమక్షంలో పెటెయిను గారిని కలిసికొని డార్లానుగారి జర్మనుసహకారవిధానము హద్దుదాటి ఆఫ్రికాలోని ఫ్రెంచికాలనీలు జర్మనీవశము జేయుబడుచో అపుడు అమెరికాకు ఉపద్రవభయమే యేర్పడును కాబట్టి అమెరికా అది సహించజాలదని అభిప్రాయపడి అమెరికా ప్రభుత్వాభిప్రాయమును నిర్మొగమాటంగా విశదపరచిరి. ఇవన్నీ ఎన్ని జరిగినను జర్మనీతో సహకారం జేయుటయా చేయకపోవుటయా అను విషయములో జర్మనీఎదుట గట్టిగా మాట్లాడగలశక్తి ఫ్రాన్సుకు ఉండిపున్నట్లయితే ఫ్రాన్సు మొదట జర్మనీ చేతిలో ఓడిపోయి యుండకపోవుండును గదా?

ఇపుడు ఇంకొక అనుమానము కలుగుచున్నది- జర్మనులు తాము సిరియాలోకి పోవుచున్నట్లు బ్రిటిషువారిని భ్రమింపజేయుచు నిజంగా యుద్ధమును లిబియానుండి ఈజిప్టుపై సాగించదలచి యున్నారా అనునది. ఎందుకనగా ఇపుడు లిబియాలోకి కూడ జర్మను సేనలు ఎక్కువగా పంపబడుచున్నవట. అక్కడ విమానాశ్రయములు నిర్మించుకొనుచున్నారట ఇంతేగాక జర్మను సేనలు ఎక్కడికి పోవుచున్నవో నిర్ధారణగా తెలియకుండునట్లు చేయుటకై బల్గేరియానుండి జర్మను సేనలు మొల్డేవియాకు పంపబడుచున్నవి- అక్కడ రష్యాసరిహద్దువద్ద జర్మను సేనలు కూడుచున్నవి- నల్లసముద్రంలో అరెనిమిది జర్మనుజలాంతర్గాములు తిరుగుచున్నవి ఇది మాచిరష్యాపైకి జర్మను సేనలు పోవునని అనుమానము కొందరి కావహించుచున్నది

ఇదే సమయంలో అలెగ్జాండ్రియాపైనను, టొబ్రూకుపైనను జర్మనీయు, ఇటాలీయు విమానముల దాడులు చాలా ప్రకోపించినవి. దీని భావంకూడ గమనించదగినదే. జూను ౮వతేదిన జరిగిన దాడిలో చాలా నష్టమయ్యెను- అందుపై ఈజిప్టుప్రభుత్వమువారు తమ ఆక్షేపణను జర్మనీ, ఇటలీల ప్రభుత్వములకు తెలిపి నష్టపరిహారమును కోరినారు- ఈ ఆక్షేపణకు జవాబు ఇవ్వకముందే జూను ౯వతేదిన నాడు అలెగ్జాండ్రియాపై మరల జర్మనువిమానాలు ఇటాలీయ విమానాలు బాంబులు వేసినవి- చాలామంది చచ్చిరి, చాలాసొత్తు నష్టమయ్యెను. మాల్టాపైకూడ ఈ ౯వతేదిన పెద్దదాడి జరిగెను- దానిలో ఒక ఇటాలీయ విమానము బ్రిటిషువిమానములు క్రిందకూల్చివేసినవి- ఇపుడు ప్రజలు అలెగ్జాండ్రియాను ఖాళీజేయవలసి వచ్చుచున్నది-

### సైప్రసువద్ద జర్మనుల మందుగసులు

జర్మనులు సైప్రసు దీవిచుట్టు సముద్రంలో మందుగసులను నాటినారు- వాటికి తట్టుకొని కాబోలు ఒక టర్కీ నౌక మునిగిపోయినది- సైప్రసు దీవిపై జర్మనువిమానాలుగూడ ఎగురుచున్నవి, ప్రజలు ప్రధాననగరము వదలిపోవుచున్నారు.



# ఆంధ్రోద్యమముపై జాతీయ ముసల్మానుల సానుభూతి

డా॥ సిరాజుల్ హసన్ తిర్మిజీగారి
ఉపన్యాసము

నిజాంరాష్ట్ర అష్టమాంధ్రమహాసభ కార్యక్రమవివరములు

గతసంచికలో నిజాంరాష్ట్ర అష్టమాంధ్రమహాసభఏర్పాట్లు, అధ్యక్షుని ఊరేగింపుమున్నగునవి సింహావలోకనంచేయబడెను. ఇపుడుముఖ్యంగా బహిరంగసభల కార్యక్రమవివరములు తెలుపబడుచున్నవి.

అధ్యక్షులవారి ఉపన్యాసము చదివినతర్వాత మహాసభకు రాజాలనిముఖ్యులుపంపిన సందేశములు చదువబడినవి:

మహాసభకు శ్రీ రాజాబహద్దర్ వెంకటరామారెడ్డిగారీ క్రిందిసందేశమంపిరి:

"అధ్యక్షులును ఇతరప్రముఖులు నేమియుపన్యసింతురో నాకు తెలియదు. ఆయుపన్యాసములన్నియు ప్రేక్షకులను దేశభక్తిపూరితులుగను హృదయపరివర్తనము కలుగునట్లుగను చేయగలిగి యుండవలెనని నాకోరిక. సమావేశమునందామోదింపబడుతీర్మానములన్నియు మరియేయితర సంస్థలపైనను ప్రోపగాండ చేయునివై యుండవలయును"

అంతటితో మొదటిబహిరంగ సమావేశ కార్యక్రమముముగిసెను.

## రెండవబహిరంగ సమావేశము

౭-౬-౪౧ బుధవారం ఉదయంము సుమారు ౬ గంటలకు సమావేశము కావలసినసభ ఆలస్యముగా ౭ గంటలకు సమావేశమయ్యెను. నల్లగొండ వైదికపాఠశాలబాలికలు జాతీయగీతములు పాడినతర్వాత సభయారంభమయ్యెను. స్థాయిసంఘకార్యదర్శి శ్రీచిక్కపల్లి రామచంద్రరావుగారు తమకార్యనివేదికను విక్రమ వైశు ౧నుండి వృష, వై,బ ౩౦ వరకు చదివి వినిపించిరి.

### నాయకుల సందేశములు

శ్రీయుత సిరాజుల్ హసన్ తిర్మిజీగారు ఉర్దూలో ఉపన్యసించిరి
యువకులగు నారాయణరెడ్డిగారిని అధ్యక్షులుగా జేసినందులకు అభినందించుచు యిట్టిగొప్పసమావేశమునకు చాలసంతసించుచుంటిమనిరి. ఉంతర్జాతీయపరిస్థితులనువివరించిరి. ఆంధ్ర మహారాష్ట్ర కర్ణాటకసభలయుద్దేశము లోక్కచేయనిరి. అధికారులు జీతములతీసుకొనుటేగాని దేశపరిస్థితుల తెలుసుకొనుటలేదనిచెప్పుచు, యువకులన్నా దేశాభ్యుదయమునకు పాటుపడవలయుననిరి.

"రైతులు పన్నులుచెల్లించలేక ఆత్మహత్యలు చేసుకొనుచుండుట అందరికి తెలిసినవిషయమే. ప్రజలకువోరస్వత్వహక్కులులేవు.సభలకుసం౹ఒకసారి అనుజ్ఞపొందునప్పటికి గండముతప్పి పిండము బయటపడుచున్నది. ఈమహాసభ జయప్రదముగాకొనసాగవలయును" అని చెప్పిరి.

మహారాష్ట్ర నాయకులయిన వినాయకరావు విద్యాలంకారుగారు సందేశమిచ్చుచు, "ఆంధ్రమహాసభ అష్టవర్షప్రాయయనియు హిందూ ధర్మశాస్త్రప్రకారము బ్రహ్మచర్యములో నున్నది. ఆంధ్రులు ఒకేనాయకునననుసరించి దృష్టి కేంద్రీకరించవలయు"ననియు సభజయప్రదముగ జరుగవలయునని కోరిరి-

జనార్దనరావుదేశాయి గారు సందేశమిచ్చుచు, అధ్యక్షులను ౩-౭వందలమైళ్ళ వేగముతోపోవు విమానముతోపోల్చి యువకులగు నీ యధ్యక్షులు అంతవేగములో దేశాభివృద్ధికరకార్యముల జేయవలయుననియు: నిజాంగవర్నమెంటుప్రకారముఉద్యోగులు రాజకీయములలో పాల్గొనలేకపోవుచున్నారనియు, వారుపాల్గొనుటకు అవకాశమియ్యవలయునని ఆంధ్రమహాసభ తీర్మానమామోదించవలయు"ననియు చెప్పిరి.

## తీర్మానముల చర్చ

### విషాద ప్రకటనము

విషాదప్రకటనను అధ్యక్షులుప్రవేశపెట్టిరి-అందరునునిలబడి తమసంతాపమునిచూపిరి- తీర్మానమేకగ్రీవముగ అంగీకరింపబడెను.

కీర్తిశేషులయిన మహాశయుల అకాలమరణమునకు విచారము తెల్పుచు అధ్యక్షపీఠమునుండి ప్రతిపాదింపబడినతీర్మానమేకగ్రీవముగ ఆమోదింపబడెను-

### గ్రామప్రజల కష్టములు

గ్రామప్రజలకష్టములను గూర్చినతీర్మానమును మధిరనివాసులు మిరియాలనారాయణ గుప్తగారు ప్రతిపాదించిరి. వారు మధిరప్రాంతమందలి యుద్యోగులు రైతులకష్టనష్టములదెలిసికొని వాటిని నివారించుటకు ప్రయత్నించరనిరి. ప్రతిగ్రామములో పాఠశాల, లైబ్రరీలేకపోవుటవల్ల ప్రజలజ్ఞానులయి తమబాధలను ప్రభుత్వమువారికి విన్నవించుకొనలేకపోవుచున్నారనిరి. సరియయిన బాటలులేవనిరి-ప్రభుత్వమునందు వ్యవసాయశాఖయనునది యింతవరకు తెలియదు. వేయిమందిజనసంఖ్య గలగ్రామములలో టపాఖానాపెట్టకపోవుటకు కారణము గ్రాహ్యముగుట లేదనియు, మద్రాసునుంచిలూక్కరుకు గరోజులో ఉత్తరములువచ్చునపుడు యీరాష్ట్రములో ఒకప్రాంతమునుండి యింకొకప్రాంతమునకు ఉత్తరములు చేరుటకు ౧౦దినములు పట్టుచున్నదనియుచెప్పిరి. టపాబంట్రోతు ప్రతిగ్రామమునకు ప్రతిదినము పోవునట్లేర్పాటుచేయవలెననిరి

పిమ్మట శ్రీ వెంకటరెడ్డిగారుపన్యసించుచు "ప్రభుత్వమువారు ఖాస్గీపాఠశాలలను మూసివేయించి వాటిస్థానేయేటిపాఠశాలలను తిరిగి స్థాపించలేదనియు, స్థాపించినతెలుగుపాఠశాలలలో తెలుగురానియుపాధ్యాయుల నియమింతురనియు, అవియుండియులేనట్లేయనినుడివిరి. గ్రామములలోమంగలివాండ్రు మంత్రసానితనముచేయుదురు. వారికిశాస్త్రపద్ధతి తెలియక అనేకఅపాయములకు కారకులగుచుండిరనియు కావునఅనుభవముకలమంత్రసామానులు అందుబాటులోనుండిన అట్టియపాయములు కలుగకుండుననియు చెప్పిరి-

శ్రీ ప్రభాకరరావుగారు తీర్మానము నామోదింపవలయునని కోరిరి-

శ్రీ చావ వెంకటకోటయ్య చౌదరిగారు మాట్లాడుచు, "గ్రామప్రజలుకష్టించి సంపాదించినధనముతో పట్టణములలో సుందరభవనముల నిర్మించుచున్నారనియు, రైతునివసించుటకు పూరిగుడిసెయే గతి యగుచుండెననియు"ననిరి-

తీర్మానమేకగ్రీవముగా నామోదింపబడెను-

### జనసామాన్య విద్య

శ్రీ కాళోజి నారాయణరావుగారు జనసామాన్యవిద్యఅనుతీర్మానమును ప్రతిపాదించుచు, "విద్యాధికులు చాలతక్కువగనున్నారనియు చాలమందిప్రజలు విద్యావిహీనులగుటచే అధికారులు చేయుదురన్యాయములను తెలుసుకొని వారిబెదరింపులను నిర్భయముగానెదిరించలేకపోవుచున్నారనియు, పల్లెటూరివారు, ఎఫ్, ఏ, బి-ఏలు చదువలేకున్నను వారికికూడప్రాథమికవిద్య అవసరమనియుచెప్పిరి,

శ్రీ. వెంకట్రామారావుగారు పై తీర్మానమునకామోదమును తెల్పుచు ఈతీర్మానమాంధ్రకర్ణాటకమహారాష్ట్రసభలలో నిదివరకుప్రతిపాదింపబడి యామోదింపబడినను ప్రభుత్వమువారి హృదయపరివర్తనముకలుగలేదనిరి. ఇన్నిజాతీయసంస్థలామోదించినప్పటికిని ప్రభుత్వమామోదించకపోవటమిక్కడిశోచనీయమనిరి విద్యకైప్రభుత్వమువారు విరివిగాకర్చుచేయుచున్నను అందు ౧౧౦కి ౭౦వంతులున్నతవిద్యకై వెచ్చించుచున్నారు ఉన్నతవిద్యకంటె మిక్కిలి యెక్కువకర్చుపెట్టవలసినది యింతతక్కువగ కర్చుచేయుచుండుటవలన ప్రాథమికవిద్యావ్యాప్తి యింతతక్కువగానుండుటలో నాశ్చర్యమేమియులేదు. ఉస్మానియావిశ్వవిద్యాలయభవననిర్మాణమునకు, విద్యాలయమునకవసరమయినదానికంటె ఉన్నదికదాయనిచాలధనము దుర్వ్యయముచేసిరి. ఉర్దూభాషలోఉన్నతవిద్యకవసరముగుగ్రంథములులేక ఇతరభాషలనుండి తర్జుమాచేయవలయును- దానికైయొకతర్జుమాశాఖయేర్పరిచి దానికత్యధికముగాకర్చుపెట్టుచున్నారు- ఈకర్చంతయు డాంబికమయినదుర్వ్యయముఅనివారుచెప్పిరి- ఉపన్యాసముముగించుచు వయోనిర్ధారణచేసి బాలబాలికలకు నిర్బంధప్రాథమికవిద్యప్రవేశపెట్టవలెననియు, ఆంధ్రమహాసభద్వారా ప్రభుత్వముఖాస్గీపాఠశాలలపైచేసిన నియమములను తొలగింపజేయవలసినఅవసరము ప్రభుత్వదృష్టికి తీసుకొనిరావలయుననియు చెప్పిరి-

కొమరగిరి నారాయణరావుగారు తీర్మానము నామోదింపవలెనని కోరిరి-

తీర్మానమేకగ్రీవముగా నామోదింపబడెను-

### మద్యపాన నిషేధము

దీనితీర్మానమును మట్టికోట ఆళ్వారుస్వామిగారు ప్రతిపాదించుచు యిట్లుపన్యసించిరి-

"నిజామాబాదులోజరిగిన ౬వఆంధ్రమహాసభలో సంపూర్ణముగ మద్యపాననిరోధ శాసనములలోపెట్టవలయునని తీర్మానింపబడియున్నది- ఇపుడుమహాసభవారు, దీనినొకతాలూకాలోనైన అమలుజరుపవలయునని ప్రభుత్వమువారినికోరుచున్నారు- దీనినమలులోపెట్టునపుడు ప్రభుత్వమువారుమున్ముందు నల్లగొండజిల్లాలోఅమలుచేయించవలెనని కోరబడుచున్నారు"

శ్రీ గవ్వా అమృతరెడ్డిగారు బలపరచినపిదప తీర్మానము నిరాఘాటముగ నామోదింపబడెను.

అంతటితో రెండవసమావేశము ముగిసెను-

# గోలకొండపత్రిక

వృషనామసం॥ర జ్యేష్ఠ బ॥ ౩

గురువారము

## దీని భావమేమి?

ఆంధ్రపత్రికలో, హైద్రాబాదు స్వకీయ విలేఖకునివార్తగా, చిల్కూరు ఆంధ్రమహాసభా విషయములలో నొకదానిగూర్చి యీ భావముగల వార్త ప్రకటింపబడినది.

అష్టమాంధ్ర మహాసభారంభ సమయమున విషాదప్రకటనను గూర్చిన ప్రసంగములో, కీర్తిశేషులయిన గిడుగు రామమూర్తి, జయంతి రామయ్య పంతులు, న్యాపతి సుబ్బారావు పంతులు గార్ల పేర్లను విషాదప్రకటన తీర్మానములో చేర్చవలెనని కోదాటినారాయణ రావుగారు సవరణను ప్రతిపాదించిరి. దానిపై, ఆంధ్రమహాసభా దృక్పథమునకు ఈ పద్ధతి వ్యతిరేకముగా నున్నందున బ్రిటిషిండియా ప్రముఖులను గురించి విషాదతీర్మానము చేయుటకు వీలులేదని అర్థమిచ్చు ప్రతికూలాభిప్రాయాన్ని విషయనిర్ణయసభలో, సప్తమాంధ్ర మహాసభాధ్యక్షులయి యుండిన మందుముల రామచంద్రరావుగారు వెల్లడించి పై ముగ్గురి పేర్లను చేర్చనీయలేదట.

మాకు దీనిలోని తర్కము అర్థముకాలేదు. నిజాం ఆంధ్రమహాసభ యొక్క దృక్పథమేమిటి? దానికి భంగకరమగు అంశమేమిటి? తెలంగానాలో ఆంధ్రోద్యమము ప్రారంభమైన నాటి నుండియు చనిపోయిన ఆంధ్రుల యెడ వివక్షత చూపించబడి యుండలేదు. అయితే ప్రభుత్వము వారేమైనా ఆక్షేపింతురేమో అని తర్కించవచ్చును. హైద్రాబాదు ప్రభుత్వమువారు బ్రతికియున్న బయటివారిని పిలిపించి ఉపన్యాసాలిప్పించువిషయములో నిరోధకాజ్ఞలు పలుమారు గావించియుండిరి. ఇంకను కావించుచున్నారు. కాని చనిపోయిన వారిపై ఏలాటి ఆంక్షలను పెట్టలేదు. చనిపోయినవారినిగురించి యేలాటి తీర్మానాలు చేయుగూడదనిశాసించిన పాపాన పోలేదు. ఒకవ్యక్తి బ్రతికియుండినప్పుడు చాలా ప్రమాదకారిగా నుండినను అతడు చనిపోయినతర్వాత అతనియాత్మపై ద్వేషము శత్రువులు సహితము ప్రకటించరు. గతయుద్ధములో లార్డు రాబర్ట్సు అను సుప్రసిద్ధ ఇంగ్లీషుసేనాని చనిపోయినప్పుడు జర్మను సైన్యము అతని జ్ఞాపకార్థము "మిలిటరీ హానర్సు" ఇచ్చియుండెను. మోతీలాల్ నెహ్రూగారు చనిపోయినప్పుడు బ్రిటిషిండియా ప్రభుత్వోన్నతాధికారులు సానుభూతి లేఖలంపిరి. వారి గౌరవార్థము బ్రిటిషుజండాను తగ్గించి యుంచిరి.

మన నిజాంరాష్ట్ర ఆంధ్రమహాసభవారు నేటివరకు అవిచ్ఛిన్నముగా బ్రిటిషిండియాలోచనిపోయిన ప్రసిద్ధాంధ్ర దేశ సేవకుల సంస్మరణను ప్రతిమహాసభలోను కావించినారు. కేవలము ఆంధ్రుల వరకే మనవారు సంకుచితభావములవారై హద్దుల నేర్పరుచుకొనియుండలేదు. ఆంధ్రేతరులను మతాంతరులను, దేశాంతరులను, ఖండాంతరులనుగూడ తమ విశాలహృదయములోనికి తీసికొనియుండిరి. ఎట్లంటారా? చూడండి!

మొట్టమొదటి ఆంధ్రమహాసభ ౧౯౩౦ లో జోగిపేటలో జరిగెను. అందలి మొట్టమొదటి తీర్మానములో మొట్టమొదటి వాక్యం ఈరీతిగా ఉన్నది.

> "విఖ్యాత ఆంధ్రపండితులగుకళా ప్రపూర్ణ వేదము వేంకటరాయ శాస్త్రిగారి నిర్యాణమునకు ఈ మహాసభవారు తమ విచారమును ప్రకటించుచున్నారు."

ఈతీర్మానమువలన ఆంధ్రమహాసభా దృక్పథానికి భంగముకలుగలేదు.

రెండవ ఆంధ్రమహాసభ (దేవరకొండ)లోని మొట్టమొదటితీర్మానమేమనగా

> "నిరుపమాన దేశభక్తులును స్వార్థత్యాగులును నగు మౌలానా మహమ్మదలీగారి యొక్కయు పండిత మోతీలాలు నెహ్రూగారియొక్కయు అకాల మరణమునకు ఈ మహాసభ వారు తమ విచారమును ప్రకటించుచు వారికుటుంబముతో తమ సానుభూతిని తెలుపుచున్నారు."

ఈతీర్మానం కావించినప్పుడును ఆంధ్రోద్యమ దృక్పథమునకు ఏమియు భంగము కలిగినట్లు కానరాదు. చనిపోయిన మహాశయులిరువురు అనాంధ్రులు. ఒకరుముసల్మానులు. ఒకరుహిందువులు. ఉభయులును బ్రిటిషుప్రభుత్వ ప్రతికూలురు. మూడవమహాసభలో అనాంధ్రులగు పండిత కేశవరావుగారి మృతికై మహాసభ విలపించినది.

అయిదవ ఆంధ్రమహాసభలోని మొట్టమొదటి తీర్మానముద్వారా పంచమజార్జిగారును జవ్వాదుజాఀగారును వామననాయకుగారును మోచర్ల రామచంద్రరావు పంతులుగారును చనిపోయినందులకు మహాసభవారు తమ "హార్దిక విచారమును" "విషాదము"ను ప్రకటించి "పరామర్శల"ను తెలుపుకొన్నారు. అప్పుడుకూడ పై తీర్మానము ఆంధ్రమహాసభవారి దృక్పథానికి భంగము కలిగించలేదు.

ఇక దేశదురదృష్టముచేత యావజ్జీవము ఆంధ్రభాషాసేవలోనే మునిగి తేలి అఖండమైన దేశసేవచేసిన జయంతి రామయ్య పంతులుగారును, గిడుగు రామమూర్తిపంతులుగారును, న్యాపతి సుబ్బారావుగారును చనిపోయినప్పుడే వారి మృతికి హార్దికముగా కాకున్నను ఉత్తవిషాదమో తుదకు విచారమో తెలిపినంతనే ఆంధ్రోద్యమ దృక్పథమునకు భంగముకలుగునా?

బాధ్యులైన సప్తమాంధ్రమహాసభాధ్యక్షుల యీ తర్కము మా నెత్తికెక్కుటలేదు!

బ్రిటిషిండియాలోని పై స్వర్గీయ మహాశయులు మన దృక్పథానికి భంగకరముగా ఎన్నడైనా వర్తించియుండిరా? అదియులేదు. ఒకవేళ వర్తించినారనికూడా వితండవాదార్థమై అనుకొందముగాక. "మరణాంతాని వైరాణి" అనికదా శ్రీరామచంద్ర భగవానులు సెలవిచ్చియుండిరి. మరి మందుముల రామచంద్రరావుగారో ....... ఈఘట్టము ఆంధ్రులకు విషాదము కలిగించకమానదు.

---

### మోటారు శాసనము

మన హైద్రాబాదు శాసనసభవారు మోటార్ల శాసనమొకటి కావించినారు. దానివివరాలు పూర్తిగా మాకు లభించలేదుకాని పత్రికలలో వచ్చినవిమర్శనలను చూచినచో, ఈ శాసనము మోటార్లను విహారానికిగాని వ్యాపారానికి గాని పెట్టుకొన్నవారికి చాలా కష్టనష్టాలు కలిగించునని తోచుచున్నది. పైగా రైల్వేబస్సులకు సౌకర్యాల కలిగించుటకై యీ శాసనము కావించబడినట్లున్నదని బాధ్యతగల నవాబ్ అక్బర్ యార్జంగు బహద్దరంతటివారనుచుండుట గమనింపదగినది. ఇక ముందు మోటారులపైవేటు పన్నులు ౨౦ నుండి ౧౫౦౦ రూపాయీల వరకుంటును. ౧౫౦౦ అంత రెండంత విధి లేక మూడంతలు అనగా మూడేండ్లపన్నుతో ఒకపెద్దలారీ క్రొత్తది లభించును. అంతగొప్ప పన్నిచ్చి మోటారుయజమాని యేమిసంపాదించును. మన దేశములో మోటార్లు పెట్టుకొనువారు స్వయంగా నష్టపడుచునేయున్నారు. పైగా దేశములోని బీదలను నష్టపెట్టుచున్నారు. అంతేకాదు ఒక్కొక్క మోటారుయజమాని విదేశములో ఒక్కొక్కబీదకుటుంబాన్ని పోషించుచువాడగుచున్నాడు ఎట్లనగా మోటారుపెట్టుకొనుటవలన బగ్గీలు గుర్రాలు మూలబడను వద్దవారు సైసులు వృత్తిలేనివారైరి. ఇక విదేశాలవారో మోటారు క్రయమునుపొందుట, పెట్రోలు క్రయమును తీసుకొనుట, రబ్బరుటైరులు, చిల్లరసామానులు యావత్తు విదేశాల నుండియే తెప్పించుట, ఇవన్నియు విదేశీయులను పోషించుమార్గాలే. ఇట్టి సందర్భాలలో పన్నులను హెచ్చించుట చాలాభారముగానుండును. ముఖ్యముగా జీవనోపాధిగా కిరాయమోటార్లను పెట్టుకొన్నవారు నష్టపడుదురు. వారియెడ మేము సానుభూతి ప్రకటించుట తప్ప మరేమిచేయగలము?

---

### హైద్రాబాదు సమాచారము

మన ప్రభుత్వప్రకటనశాఖవారు ఇంగ్లీషులో హైద్రాబాదుఇన్ ఫర్మేషన్ మాసపత్రికతోపాటు దేశభాషలలోను ప్రకటించినారు. తెనుగులో హైద్రాబాదు సమాచారము అనుపేరుతో ప్రకటించినారు. తెనుగుభాష అచ్చుటచ్చట సరిగాలేదు. అయినా మొత్తముమీద సలక్షణంగాఉన్నది. తెనుగుటైపు క్రొత్తపద్ధతిగా ఉన్నది. ఇంగ్లీషులోని మోనోటైపుపద్ధతిపై దానినికూడా కనిపెట్టి ప్రచారములోనికి తెచ్చుచున్నారు. ఇది తెనుగుటైపులో గొప్ప మార్పు. ఇందుసౌలభ్యమున్నట్లైతే మన హైద్రాబాదువారికే ఈనూతన నిర్మాణంలో ప్రథమగౌరవము లభించును దేశభాషలలో ప్రచారముచేసి, దేశభాషలకు సహాకారముచేయుచున్న ప్రకటనశాఖానాజంగారికి మాధన్యవాదము లర్పించుకొనుచున్నాము. వారిహృదయవైశాల్యమత్యంత ప్రశంసనీయము. ఆంధ్రులు వారియెడ కృతజ్ఞులైయున్నారు.

---

## నిజాంరాష్ట్ర అష్టమ ఆంధ్ర మహిళా మహాసభ

### ఆమోదింపబడిన తీర్మానములు

**విషాద ప్రకటనము**

చిలుకూరు, జూలై ౪

౧ మహాఘనతవహించిన ప్రభువుగారి ప్రియ మాతయు పూజ్యురాలునగు శ్రీదక్కన్ మాత వాజరహాబడీబేగం సాహిబావారి మరణమునకు ఈసభవారు తమగాఢసంతాపమును వెళ్ళబుచ్చుచూ శ్రీప్రభువుగారికిని వారి కుటుంబమునకును మాహృదయపూర్వక సానుభూతిని దెలుపుకొనుచున్నారు,

౨ మనరాష్ట్రములో మహిళోద్యమానికి ముఖ్యస్థాపకురాలునుమనప్రధానామాత్యులవారి సతీమణియునగు శ్రీలేడీఅమీనా హైదరీ గారి మరణమువలన మనమహిళోద్యమమునకుతీరనికొరతగలైనని ఈసభవారు దుఃఖించుచున్నారు.

౩ సుప్రసిద్ధసంఘసేవాప్రియురాలయిన కే. సుశీలాదేవి గారిమరణమునకు ఈసభవారు విచారించుచున్నారు,

(అధ్యక్ష పీఠమునుండి)

**విద్యా విషయము**

౪ స్త్రీలకు వారిమాతృభాషలో ప్రాథమికవిద్య ఉచితంగానూ నిర్బంధంగానూ నేర్పవలెనని యూ, ఇప్పుడున్న సర్కారు పాఠశాలలన్నింటిలోనూ ఈవిధానమును వెంటనే ప్రవేశపెట్టవలెనని యూ ఖాస్గీపాఠశాలల నియమము స్త్రీలపాఠశాలలవరకైనా వర్తింపకుండా చెయ్యవలెననియూ, కోరుచున్నారు.

(ఉపపాదకురాలు:-మాడపాటి మాణిక్యమ్మ గారు.

బలపరచినవారు-ఆర్. అండాళమ్మ నల్లగొండ) యమ్, అహల్యాబాయి నల్లగొండ)

౫ స్త్రీలకు మాధ్యమికవిద్యమాతృభాషలో అంగీకరించుచూచేసిన ఉన్నతనిర్బంధమునుతొలగించిదానినిఐచ్ఛికభాషగా వుంచవలెననీ, ఉన్నతవిద్యనుగూడా మాతృభాషల్లో ప్రవేశపెట్టవలెననీకోరుచున్నారు.

ప్రతిపాదకురాలు_ ప, రుక్మిణమ్మ గారు (నల్లగొండ)

బలపరచినవారు_ వేద వతీదేవి నల్లగొండ సీతాకుమారి (హైదరాబాదు)

**సాంఘికము**

౬ ఇంతకాలమునుండి అనేక మహిళాసభలచేతను మనమహాసభచేతనుగూడకోరబడిన బాల్యవివాహనిరోధశాసనము ఓడిపోయినందులకువిచారించి ప్రజలను ప్రౌఢావివాహములనే జేయవలెనని హెచ్చరించుచూ, తిరిగీశాసనముకొరకు ప్రయత్నించవలెనని శాసనసభలనుకోరుచున్నారు,

ఉపపాదకురాలు—సీతాకుమారిగారు

ఆమోదన— పురం రుక్మిణమ్మగారు, పులిజాల కమలాబాయిగారు

౭ మన వివాహపద్ధతిలోగల హేయమైన కన్యావరశుల్కములు దూబరాఖర్చులు, బహుభార్యాత్వము, దేశారిష్టదాయకమైన వృద్ధవివాహములు, దీర్ఘవయోభేదము మొదలైనలోపములను తొలగించుకొనుటకు ప్రజలనుగోరుచున్నారు.

ఉపపాదన_ అమరవాది సీతారామమ్మగారు (సూర్యాపేట)

ఆమోదన_ యమ్ పద్మాబాయి, అహల్యాదేవి, పురం రుక్మిణమ్మ, తడక మళ్ళరంగనాయకమ్మ, కుమారిసుజాత యు. సీతాకుమారి,

౮ పురుషులుఏకారణంచేత నన్నాప్రథమభార్యనువిడిచిపెట్టిద్వితీయవివాహంజేసుకున్నట్లయితే ఆభార్యకు ఇష్టమూఅనుకూలమూవున్నయెడలతిరిగీ వివాహముజేసుకొనవచ్చునని యూ, దీనినిప్రభుత్వమువారు శాసనముద్వారా అంగీకరించవలెనని యూ ఈమహాసభవారు కోరుచున్నారు.

ఉపపాదకురాలు— సీతాకుమారిగారు

ఆమోదన_ మా॥ మాణిక్యమ్మగారు, పులిజాల కమలాబాయిగారు, అమరవాది సీతారామమ్మ గారు,

**ఆర్థికము**

౯ స్త్రీలఅనేకదురవస్థలకు వారిఆర్థికలోపమే కారణముగనుక స్త్రీలకుపుట్టినింటనుంచి వారసత్వపుహక్కులను, వితంతువులకుతమభర్తలఆస్తిపై సంపూర్ణాధికారమునిచ్చుశాసనము వెంటనేచేయవలెనని ప్రభుత్వమువారిని ప్రార్థించుచున్నారు.

ఉపపాదకురాలు— పురం రుక్మిణమ్మగారు, యమ్. పద్మాబాయి, దేవులపల్లి రంగమ్మ, తడక మళ్ళ రంగనాయకమ్మ, యు. సీతాకుమారి.

**వైద్యము**

౧౦ మనరాష్ట్రమున అంతకంతకు అనారోగ్యముఎక్కువైపోవుచున్నందున ప్రతిగ్రామమునందును ఉచితవైద్యశాలలనుస్థాపించవలెననియు, సాధ్యమైనంతవరకు ఈవైద్యశాలలలోమనదేశమునకు అనుకూలమైనదియు మితవ్యయసాధ్యమైనదియునగు ఆయుర్వేద వైద్యమును ప్రవేశపెట్టవలెననియూ, విపరీతముగాపెరిగిపోవుచున్న బాలింతరాండ్రశిశువులమరణములను తగ్గించుటకై శిక్షణపొందిన మంత్రసానులను గ్రామములయందు ఏర్పరచవలెననియూ ఈసభవారు ప్రభుత్వమువారిని కోరుచున్నారు_

౧౧ మన స్త్రీలలో శరీరారోగ్యమునుపెంపొందించుటకు వ్యాయామశాలలను ఎక్కువగా స్థాపించవలెననియూ, ఇపుడు బియ్యము మొదలైనపుష్టికరపదార్థములనే భుజించవలెననియూ ఈసభవారు ప్రజలనుకోరుచున్నారు_

**ఉపన్యాసకురాండ్రు**

మాణిక్యమ్మగారు, రుక్మిణమ్మగారు టి.అండాలమ్మగారు, పులిజాల కమలాబాయిగారు, తడకమళ్ళ రంగనాయకమ్మగారు

**౧౨ మిశ్రమము**

మనరాష్ట్రమునందుగృహపారిశ్రామిక కేంద్రములనువిరివిగా స్థాపింపవలెననియు, దేశీయపరిశ్రమలను విధిగాపోషింపవలెననియు ప్రజలను గోరుచున్నారు.

**ఉపన్యాసకురాండ్రు**

తడకమళ్ళ రంగనాయకమ్మగారు. పురం రుక్మిణమ్మగారు అహల్యాబాయిగారు.

౧౩ తెలంగానాప్రాంతములో విపరీతముగా పెరిగిపోయినమద్యపానమునకు మిక్కిలివిచారించుచూ సాధ్యమైనంతత్వరగా శాసనముచేతనే ఈపద్ధతినిమాన్పించి దేశారోగ్యమును గాపాడవలెనని ప్రభుత్వమువారిని ఈసభవారు ప్రార్థించుచున్నారు.

**ఉపన్యాసకురాండ్రు**

పురం రుక్మిణమ్మ, పులిజాల కమలాబాయి, మాణిక్యమ్మ, సుజాత, పి. అహల్య, జయలక్ష్మిబాయిగార్లు.

౧౪ దేశావర్ధదాయకమైన అస్పృశ్యతాపద్ధతిని శీఘ్రముగా నిర్మూలించుటకు స్త్రీలేఎక్కువగా పూనుకొనవలెనని దేశీయులను ఈసభవారుగోరుచున్నారు.

**ఉపన్యాసకురాండ్రు**

ఎ.రుక్మిణమ్మగారు నల్లగొండ కుమారినళిని హైదరాబాదు.

౧౫ మనరాష్ట్రములోని దొరలఇండ్లలోను దేవాలయములలోనువున్న ఆడపాపలపద్ధతి మంచిదిగాదని భావించుచు వారికివివాహములను చేయవలెనని ఈసభవారు హెచ్చరించుచున్నారు.

**ఉపన్యాసకురాండ్రు**

యమ్ పద్మాబాయిగారు, (నల్లగొండ) ఆర్ అండాలమ్మగారు—

౧౬ అనేకవిధములైన అక్రమములకును అనారోగ్యమునకును, అనర్థములకును హేయమైన ఘోషాపద్ధతిని వదిలిపెట్టవలసినదిగా మనరెడ్డి వెలమ గోల్కొండవ్యాపారి స్త్రీలను ఈమహాసభవారుకోరుచున్నారు.

**ఉపన్యాసకురాండ్రు**

పులిజాల కమలాబాయిగారు, కుమారిసునంద తడకమళ్ళరంగనాయకమ్మ (అన్నవరం)

౧౭ మనరాష్ట్రమునందలి నిరాధారులగు స్త్రీలకొరకు ఒకఅనాథాలయము సాధ్యమైనంతత్వరగా స్థాపింపవలెనని దేశీయులను ఈసభవారు కోరుచున్నారు.

**ఉపన్యాసకురాండ్రు**

సీతాకుమారి, రుక్మిణమ్మ గార్లు

౧౮ మన స్త్రీలలో సర్వత్రప్రబోధము కల్గుటకును నిర్మాణకార్యక్రమము సరిగాజరుగుటకును ప్రతిగ్రామమునందును మహిళాసంఘములను స్థాపింపవలెనని ఈమహాసభవారు ప్రజలనుగోరుచున్నారు.

౫ వ పేజీ చూడుడు

# దేశమంతటను ఖాక్సారులపై ప్రభుత్వాంక్ష

## మొత్తము ౩౦ వేలమంది

ఇపుడు భారతదేశమంతటను ఖాక్సారులపై ప్రభుత్వములు ఆంక్షలను పెట్టినవి.

ప్రస్తుతం ఖాక్సారులు మొత్తం ౩౦౦౦౦మంది వున్నారనియు, వారిలో ౧౪౦౦౦ మంది సంయుక్తరాష్ట్రములలోవున్నారనియు తెలుస్తున్నది. ౫౦౦౦ మందికిపైగా పంజాబులోవున్నారు, ఇతరులు ఇతరరాష్ట్రములలోను, సంస్థానాలలోను యున్నారు, ఖాక్సారులు తమసంఖ్య ఇంతకంటె ఇంకా అధికమనియే చెప్పుకొనుచున్నారు, కొన్ని రాష్ట్రములలో ఖాక్సారులఅరెస్టులు, నిర్బంధములుజరుగుచున్నవి.

---

## ఆంధ్రమహాసభ కార్యకారిణీ సభ్యులపట్టిక

హైదరాబాదు (దక్కన్), అమర్దాదు ౧౦ ఈక్రిందివారు నిజాంరాష్ట్రాంధ్ర మహాసభాధ్యక్షునిచే నూతనసంవత్సర కార్యకారిణీ సంఘసభ్యులుగా నియుక్తులైనారు:-

ఉపాధ్యక్షులు శ్రీయుత మాదిరాజు రామకోటేశ్వరరావుగారు,

కార్యదర్శి ,, చిక్కపల్లి రామచంద్ర రావుగారు

కోశాధిపతి ,, పి. శ్రీనివాసరెడ్డి గారు

సభ్యులు

శ్రీయుత మందుముల రామచంద్రరావు గారు

,, రామనాథముగారు [ఖమ్మం]

,, వేంకటస్వామిగారు [సికింద్రాబాదు]

,, ఆళ్వారుస్వామిగారు [ ,, ]

,, ఈ. కేశవరావుగారు

,, డి, రామారెడ్డిగారు [ఆత్రాపుబల్దా]

సంయుక్త కార్యదర్శి నియామకమింకాజరుగలేదు. జరుగగానే ప్రకటింపబడును.

---

## టెక్నికల్ ట్రెయినింగు సౌకర్యాలు

హైదరాబాదు (దక్కన్), అమర్దాదు ౫ ప్రభుత్వప్రకటన శాఖవారిట్లు తెలుపుచున్నారు.

హైదరాబాదునగరములో కాచీగూడాలో ప్రభుత్వ టెక్నికల్ ట్రెయినింగు కేంద్రమువిర్పాటుచేసినారు. అందుచేరుప్రతివిద్యార్థికి నెలకు ౧౦ రూపాయీల సహాయముచేయుచున్నారు ఇప్పుడుదానిపైన మరి ౨౫౦ ఎక్కువగాఇచ్చుటకేర్పాటుచేసినారు. విద్యార్థికప్పటికప్పుడేపైకం యియ్యరు. మధ్యనవదలిపోతే వారికదిపనున్నిదొరకదు. పూర్తి విద్య నేర్చుకొన్నతర్వాత మొత్తమంతయును చేతికియ్యబడును. ఇంతవరకు టెక్నికల్ శిక్షణలో ౪౫౦ మందికి చోటుఉండింది. ఇప్పుడు ౬౨౨ మందికి ఏర్పాటుచేసినారు.

---

౪ వ పేజి తరువాయి

ఉపన్యాసకురాండ్రు

సీతాకుమారి, మాణిక్యమ్మ, పద్మాబాయి గార్లు

స్థాయిసంఘంఎన్నిక

ఈక్రింది స్థాయిసంఘము సీతాకుమారిగారిచేత ఉపపాదింపబడి కమలాబాయిగారిచే ఆమోదింపబడి ఏకగ్రీవంగా అంగీకరింపబడినది,

అధ్యక్షురాలు శ్రీరంగమ్మగారు

ఉపాధ్యక్షురాలు-శ్రీ బూర్గుల అనంతలక్ష్మిదేవిగారు.

కార్యదర్శినులు శ్రీఎల్లాప్రగడ సీతాకుమారిగారు శ్రీమాడపాటి మాణిక్యమ్మగారు.

---

## స్త్రీలబళ్లలో ఉర్దూ నిర్బంధము

హైదరాబాదుదక్కన్,అమర్దాదు౫ ముషీరెదక్కన్‌లో ౬ అమర్దాదునాటి (౧౧ జూన్) సంపాదకీయములో ఈవిధంగా విమర్శించినారు.

"రయ్యతుపత్రికలో ఔరంగాబాదుశేఖయిట్లు ప్రకటింపబడినది_ "శారదామందిరకన్యాపాఠశాల మంచిఅభివృద్ధిలోఉన్నది. దానికిపూర్వము విద్యాశాఖనుండి నెలకు ౩౫ రూ॥ లభించుచుండెను. తర్వాత దానిఅభివృద్ధికి మెచ్చుకొని విద్యాశాఖవారు నెలకు ౭౫ రూ॥వరకు సహాయముహెచ్చించిరి, కాని ఇటీవల అధికారులు పరీక్షించి మీపాఠశాలలో ఉర్దూలో తగినంతబోధఇచ్చుటలేదని ఆ ౭౫ రూ యిచ్చుటను ఆపివేసినారు"

వృద్ధికివచ్చుచున్న ఒకబాలికాపాఠశాలకుద్రవ్యసహాయము కేవలం ఉర్దూను (ప్రజాభిప్రాయ వ్యతిరేకముగా) బాగాచదివించలేదను మిషచేత ఆపివేయుట ఉత్సాహభంగకరముగాఉన్నది. దీనిని అధికారులు పునరాలోచింతురుగాక! ఎట్టిగురికి పాల్పడినది, ఈయొక్క పాఠశాలయేకాదు. విశేశ్వర్షని బాలికోన్నతపాఠశాలకును ఇట్లేజేసినారు, అచ్చటఉర్దూ చెప్పించుటలేదనుకారణంచేతమాత్రమే ప్రభుత్వముసహాయము చేయుటను మానివేసెను. కుమారురెండేండ్లనుండి బాలికాపాఠశాలలలో మాతృభాషద్వారా విద్యచెప్పించుటకు ప్రభుత్వమువారంగీకరించిరి. కాని అందుఉర్దూను నిర్బంధముగా చెప్పించుటలో హిందూప్రజలు సంపూర్ణముగా విరుద్ధముగాఉన్నారు. పూర్వంలోని మాటలట్లుండనీ ఇటీవలజరిగిన మహాసభలలో అనగా పర్భనీలోజరిగిన ప్రజావిద్యామహాసభలోను, ముదిరాజమహాసభలోను, ఆంధ్రమహాసభలోను, ఆంధ్రమహిళాసభలోను, ఉర్దూనిర్బంధము కూడదని తీర్మానాలు కావింపబడెను. అధ్యక్షుల ఉపన్యాసాలలోకూడ ఇదేచర్చచేయబడెను.

మేమును ఎన్నిరోమారులు ఈవిషయములో మాఅభిప్రాయమును ప్రకటించినాము, హిందూబలికలపై ఈఉర్దూనిర్బంధము ఎటుమాచినను తర్కానికందనిదిగా కనబడుచున్నది.ఈరెండేండ్లఅనుభవాన్ని బట్టియైనా ప్రభుత్వమువారు ఈనిర్బంధాన్ని తొలగించి ఉర్దూను ఐచ్ఛికభాషగా ఏర్పాటుచేయగలరు"

---

## అలీగడ్ వారి కృతజ్ఞత

### మా-ఘ-వ-ప్రభువుగారితో విజ్ఞప్తి

అలీగడ్ విద్యాపీఠం వైస్ చాన్సలర్ గారైన జియావుద్దీన్ అహమదు గారు ప్రభుత్వాతిథిగా వచ్చినిలిచియున్నారు. వారు మ-ఘ-వ-నిజాంప్రభువుగారికొకలేఖవ్రాసినారు. అందువారు మాదిరెదక్కన్ గారి మృతికై తమవిచారమును తెలిపినారు, తమసొంతతల్లి చనిపోయినట్లుగా తాము వ్యసనపడినామనిన్నీ తాము ఛహల్లుంవాడు అలీగడ్‌లోనే యిదేయేర్పాట్లలోనున్నందున స్వయముగా హైదరాబాదుకు రాలేకపోతిమనియు తెలుపుకొన్నారు. మరొకలేఖలో శ్రీమ-ఘ-వ-నిజాంప్రభువుగారు అలీగడ్ విద్యాపీఠావరణములో మసీదుకట్టించుటకు సెలవిచ్చినందులకు తమకృతజ్ఞతను ౯ కోట్ల భారతీయ ముస్లిముల పక్షాన తెలుపుకొన్నారు,

---

## హైదరాబాదు ఆరోగ్యం

హైదరాబాదు(దక్కన్), అమర్దాదు౫ నగరంలోఎలుకలు చంపుటజారీఉన్నది. బీదుఉస్మానాబాదులలో బిదరులో కొద్దిగా ప్లేగు ఉన్నది నగరంలో మూడుకేసులైనవి-గతవారం ఏమిన్నీకేసులుకాలేదు, మలేరియా నిర్మూలానికి బాగాప్రయత్నాలు జరుగుచున్నవి. బావులలో మలేరియాదోమలతిను చేపలను విడుచుచున్నారు.

---

# 'ఆంధ్ర' పద నిర్వచనము

## పెద్దల హ్రస్వదృష్టిని యువకులు ఖండించుట

## చిలుకూరు మహాసభలో చర్చల వివరాలు ✓

చిలుకూరు, జూన్ ౩

మూడవరోజు కార్యక్రమమున ఆంధ్రపదనిర్వచనమువిషయమై తీవ్రమైనవాదోపవాదములు జరిగినవి. మహాసభనియమావళిమార్చుటకు నియమింపబడినసంఘంవారు 'నిజాంరాష్ట్రాంధ్రప్రాంతమున స్థిరనివాసులైనవారందరును యీనియమావళియందు ఆంధ్రులుగా నెంచబడుదురు'అని నిర్వచించిరి. ఇంతకుపూర్వముగలనియమములలో 'నిజాంరాష్ట్రమునస్థిరనివాసులై ఆంధ్రము మాతృభాషగాగలవారును, నిజాంరాష్ట్రాంధ్రదేశమున స్థిరనివాసముగలిగి ఆంధ్రులమని చెప్పుకొనువారును, ఈనియమావళియందు ఆంధ్రులుగా నెంచబడుదురు' అనికలదు.

యువకుల ప్రతిఘటన

సుప్రసిద్ధాంధ్రులును కీర్తిశేషులగు గిడుగు రామమూర్తిపంతులు మున్నగువారలమరణమునకు విచారము తెలుపుటయే నిజాంరాష్ట్ర ఆంధ్రమహాసభాతత్త్వవకివిరుద్ధమని పెద్దలువాదించుటచే (ఆయిదవ ఆంధ్రమహాసభలో మోచర్ల రామచంద్రరావుపంతులువారిమరణమునకు రెండవఆంధ్రమహాసభలో మోతీలాలునెహ్రూహాజాలాజా మహమ్మదలీగార్లమరణమునకు విషాదము ప్రకటించియుండిరి. రాజకీయంగాతప్ప నిజాం బ్రిటిషాంధ్రభేదములుగిట్టకపోవుటచేతను యువకులు ఆంధ్రపద నిర్వచనములలోని పైమార్పునుప్రతిఘటించిరికాని వారుగావించినఒకపొరపాటువల్ల వారోడిపోయిరి. ఆంధ్రపదమునకు క్రొత్తగా గావించిన నిర్వచనమునుఒప్పుకొన్నచో ఆంధ్రమహాసభ తెలంగాణామహాసభయగుననియు, ఆంధ్రపదముండినచో ఎక్కడఉన్నను ఆంధ్రులని ఒప్పుకొనవలసివచ్చుననియు, అందుచేత ఆంధ్రపదనిర్వచనమైనా మార్చండిలేక 'తెలంగాణామహాసభ'యని పేరునైనామార్చుకోమని యువకులుపెద్దలతో వాదించిరి. నియమములలో మొట్టమొదట పేరుసంగతివచ్చుటవల్ల నిజాంరాష్ట్రాంధ్ర మహాసభయను పేరుతీసివేసి తెలంగాణామహాసభయనిఉంచవలెనని సవరణతీసుకొనివచ్చిరి. ఇరువదిసంవత్సరాలనుండిఉన్న మాపేరుమార్చుకోమంటారుచూడుడని, సవరణప్రతిపాదకులఉద్దేశాలు తల్లక్రిందులుచేసి ప్రతినిధులభ్రమింపజేయటానికి పెద్దలకు అవకాశముకలిగినది. ఆకారణంవల్ల ఆంధ్రపదనిర్వచనంమార్పు కూడదన్న విషయంలో కూడ యువకులు ఓడిపోయిరి.)

ప్రాథమిక సభ్యులు

(నియమములమార్పులలోకెల్ల గొప్పది ప్రాథమికసభ్యులకు రెఅణాలుచందాపట్టి మహాసభకు వానిప్రతినిధిగాతీసుకొనక ప్రాథమికసభ్యులగరపునే ప్రతినిధులువచ్చునట్లుచేయుట

రాబోవుసభ వరంగల్లుకు ఆహ్వానింపబడుట

౯వఆంధ్రమహాసభ వరంగల్లుజిల్లాకుఆహ్వానింపబడినది.

మహాసభ ఉత్సాహంతోను కరతాళధ్వనులతోను జయప్రదంగాముగిసింది )

(ఆంధ్రపత్రిక)

---

## జో హ్రామసీదు అలీఘరులో

### మ. ఘ. వ. నిజాం ప్రభువుగారి ఏర్పాటు.

ముషేదక్కన్ ౪అమర్దాదునాటి పత్రికలో మ. ఘ, వ, నిజాంప్రభువుగారు అధికారేతరముగా ఒకవార్తనుప్రకటించినారు అదేమనగా

అలీగడ్ విద్యాపీఠములో ఒకేమసీదున్నది. విద్యార్థులసంఖ్య దినదినము హెచ్చుచుఉన్నది. అందుచేత విద్యార్థులకునమాజు చేయుటకుఇబ్బంది కలుగుచున్నది. ఇపుడుమసీదు చిన్నదిగాఉన్నది. అందుచేత విద్యార్థులకొరకు ఇబ్బందిలేకుండా మరొకమసీదు నిర్మించవలెను.

ప్రస్తుత హైదరాబాదురాష్ట్ర పరిపాలకుడు అలీగడ్ విద్యాపీఠమునకు ఛాన్సలరుగా ఉన్నందునను హైదరాబాదునకు పైపీఠముతో ప్రత్యేకసంబంధంఉంటు ఉండడంచేతను, అచ్చటఒకతగినట్టిమసీదు మాదిరెదక్కన్‌కు పుణ్యములభించుటకై ఆలోచనతో జోహ్రామసీదుఅను పేరుతో నిర్మింపబడగలదు. అదితామీరుశాఖవారి పర్యవేక్షణలోకాగలదు ఈమసీదునకగు వ్యయమును దానినిముందునడుపుటకైఖర్చునుసర్కారుఖాతానుండియియ్యబడును నిర్మాణముపూర్తి అయినతర్వాత ఈపరిపాలకుడు స్వయముగాదాని ప్రారంభోత్సవమును చేయుగలడు

ఈమసీదునన్నీ లకునుషియాలకునుప్రవేశయోగ్యమైనదైయుండును. ఎందుకంటే ఇదిదేవునిదైయున్నది.

---

యుద్ధనిధి

హైదరాబాదు(దక్కన్), అమర్దాదు౫ హైదరాబాదు యుద్ధ సహాయనిధికిగాను ౩౦-౪-౧౯౪౧ వరకు ౩౭౯౯౨౬ హాలీలున్ను ౨౬౧౨౬౦కల్దారున్ను వసూలైయుండెను తరువాత ౧౧౨౦౯౮ హాలీలున్ను ౯౪౭౨ కల్దారులున్ను వసూలయ్యెను. జిల్లాలలోని వివిధపాఠశాలలు కచ్చేరీలను డి అధికారులనుండి రైతులనుండి చందాలువసూలయ్యెను.

---

స్త్రీలయుద్ధసహాయము

హైదరాబాదు అమర్దాదు ౫

ఆల్లిన ఉన్ని పరికరాల అవసరంచాలా కలుగుతూఉన్నది. రానున్న చలికాలంలో యుద్ధం చాలదూరంవిస్తరించుకొనిపోవచ్చును. కావునఇప్పుడు అల్లుతూఉండే స్త్రీలు ఇంకాఎక్కువశ్రద్ధచేయవలెను. ఉన్ని కావలసినవారు హైదరాబాదునగరంలో బషీర్ బాగురోడులో ఉండేలేడీ హైదరీక్లబ్బులోనుండి తెప్పించుకోగలరు-

---

ఉద్రేకంలో చేసినదానికి ప్రాయశ్చిత్తం

హైదరాబాదు అమర్దాదు ౫

ఒకఖాకీబడిపంతులు బాలకిష్టయ్యఅనేఅతడు ఒకసభలో ఉద్రేకమువచ్చి ఒకపాటజోరుగాపాడినాడు. అందు మహమూద్, జహాంగీరులు హిందువులను పూర్వంలో కష్టపెట్టినభావాలుండినవి, అందుపైఅతన్ని పోలీసువారుపట్టుకొని కోర్టులోనిలబెట్టినారు. అప్పటికి బాలకిష్టయ్యఉద్రేకం శాంతంగాదిగిపోయింది. తాను తప్పుచేసిందిగమనించినాడు. బుద్ధిమంతునివలె తప్పైంది క్షమించండిఅని కోరుకొన్నాడు- కోర్టువారు ఈక్షమాపణను ప్రభుత్వానికంపినారు.ఇంకను తుదిఆజ్ఞలురాలేదు.

---

౫౦ లక్షలయుద్ధసహాయనిధి

హైదరాబాదు ప్రభుత్వమువారిదివరలో ౫౦ లక్షలు వడ్డీలేనిఅప్పును యుద్ధానికిగాను ఇచ్చియుండిరి, ఇప్పుడుమరల ౫౦ లక్షలు వడ్డీలేకుండా అప్పుగాఇచ్చియున్నారు.

---

సికింద్రాబాదుడిస్ట్రిక్టు మున్‌సిఫ్‌కోర్టులో

ఒ. యస్. నం. 65 ఆఫ్ 1939.

వాదులు=బి. వీరన్న తదితరులు

ప్రతివాదులు=రత్నం మరియొకరు

ఈక్రింద సంతకముచేసిన రిసీవరు న్యాయస్థానమువారి ఆజ్ఞానుసారముగా బొంబాయిలోని సీతారాం జవారీమల్ గారి ఖాతాకంపెనీయొక్క బాకీలను కొన్నిటిని మినహాయించి తక్కినవాటిని హైదరాబాదు(దక్కన్) నగరంలో సుల్తానుబజారులో తనఆఫీసువద్ద ౧౯౪౧ జూనుగ౯వతేది శుక్రవారం ఉదయం ౮ గంటలనుండి వేలముతో అందరికంటె ఎక్కువపాట పాడినవారికి అమ్మగలరు ఆ అమ్మకమునకు కోర్టువారు ఆమోదము తెలిపినతర్వాత అదిచెల్లును. మినహాయించబడిన బాకీలేవో వాటిని రిసీవరునడిగి తెలిసికొనవచ్చును.

18_5_41 } కె. శ్రీనివాసరాఘవాచారి రిసీవరు

---

## హైదరాబాదు బజారు ధరలు

తేది ౩౦_౮_౫౦ ఫ.

పల్లా ౧కి ౧౨౦ సేర్లతూకము ధరలన్నీ హాలీలే.

| బియ్యము | పల్లా ౧కి ధర రూ | అ | పై | |
|---|---|---|---|---|
| కిచిడిసాంబర్లు | ౨౦ నుండి ౨౧ | | | |
| సంబర్లు | ౨౨ | ౦ | ౦ | |
| ఢిల్లీబోగాలు | ౨౨ | ౦ | ౦ | |
| రాంసాగరు | ౧౯ | ౮ | ౦ | |
| వానక్రాం | ౧౮ | ౪ | ౦ | |
| ,, | ౨౧ | ౦ | ౦ | కొత్తవి |
| ఆర్కాటి | ౧౮ | ౦ | ౦ | కొత్తవి |
| ,, | ౨౧ | ౦ | ౦ | పాతవి |
| కోవామణి | ౧౩ నుండి ౧౯ | | | పాతవి |
| బుడుములు | ౧౫ | ౦ | ౦ | |
| దేశావరి | ౧౫ | ౦ | ౦ | |
| **గోధుములు** | | | | |
| షర్బతి | ౧౮ | ౦ | ౦ | |
| బన్సీ | ౧౮ | ౦ | ౦ | |
| అమ్మకీ | ౧౬ | ౮ | ౦ | |
| పోటియా | ౧౫ | ౦ | ౦ | |
| ఎర్రగోధుములు | ౧౪ | ౮ | ౦ | |
| **జొన్నలు** | | | | |
| తెల్ల జొన్నలు | ౧౦ | ౦ | ౦ | |
| పచ్చజొన్నలు | ౯ | ౮ | ౦ | |
| మడిక జొన్నలు | ౭ | ౧౨ | ౦ | |
| సెనగలు | ౧౪ | ౮ | ౦ | |
| కందులు | ౮ | ౮ | ౦ | |
| మినుములు | ౧౦ | ౬ | ౦ | |
| అంకలు | ౧౨ | ౮ | ౦ | |
| సజ్జలు | ౭ | ౮ | ౦ | |
| **పప్పులు** | | | | |
| సెనగ పప్పు | ౧౮ | ౪ | ౦ | |
| కంది ,, | ౧౫ | ౮ | ౦ | |
| పిరిసెనగ ,, | ౧౯ | ౮ | ౦ | |
| అంక ,, | ౧౫ | ౪ | ౦ | |
| మినప ,, | ౧౭ | ౮ | ౦ | |
| పెసర ,, | ౧౮ | ౮ | ౦ | |
| బెల్లము | ౧౧ | ౦ | ౦ | |
| ఉప్పు | ౧౨ | ౧౩ | ౦ | |
| వుల్లిగడ్డ | ౧౦ | ౪ | ౦ | వరకు |
| తెల్లవడుగు | ౧౨ నుంచి ౨౦ వరకు | | | |
| చక్కెర మణుము [౪౦ సేర్లు] | | | | |
| జావా ,, ,, | ౧౪ | ౦ | ౦ | |
| బొంబాయి ,, ,, | ౧౩ | ౧౪ | ౦ | |
| మద్రాసు ,, ,, | ౧౩ | ౧౫ | ౦ | |
| నిజామాబాదు ,, ,, | ౧౩ | ౧౨ | ౦ | |
| ఎర్రచక్కెర ,, పల్ల౧౩,౧౨ | | ౮ | ౦ | |
| దర్గచక్కెర ,, ౪౦ సే. | ౧౬ | ౧౨ | ౦ | |
| ఎల్లిగడ్డ మణుము ౧౨ సే. | ౧౩ | ౧౨ | ౦ | |
| అల్లం ,, ,, | ౪ | ౦ | ౦ | |
| మణుము ౧౨ సే. | | | | |
| కొబ్బెరనూనె ,, | ౪ | ౮ | ౦ | |
| కుసుమనూనె ,, | ౩ | ౪ | ౦ | |
| నువ్వులనూనె ,, | ౩ | ౧౨ | ౦ | |
| వేరుసెనగనూనె ,, | ౨ | ౮ | ౦ | |
| కిరోసిన్ (గ్యాస్) ,, డబ్బా ౧౬ | | | | |
| **నెయ్యి** మణుము ౪౦ సేర్లు | | | | |
| విదరు నెయ్యి ,, | ౪౨ | ౦ | ౦ | |
| తెలంగాణా ,, | ౩౯ | ౦ | ౦ | |
| వనస్పతి డబ్బా ౧కి | ౧౧ | ౨ | ౦ | |
| బంగారు తు॥ ౧కి | ౫౦ | ౪ | ౦ | |
| వెండి ౧౦౦ తు | ౭౨ | ౨ | ౦ | |
| ,, తు ౧కి | ౦ | ౧౧ | ౬ | |
| సవరన్ ౧కికల్దారు రూ- | ౨౮ | ౮ | ౦ | |
| **మారకం** | | | | |
| హాలీకి కల్దార్లు | ౧౬ | ౬ | ౦ | |
| కల్దారుకు హాలీలు | ౧౬ | ౫ | ౦ | |
| ఆముదాలు బస్తా | ౧౧ | ౪ | ౦ | |
| వేరుసెనగ ,, | ౮ | ౪ | ౦ | |
| బుడ్డలు పల్లా ౧కి | ౮ | ౪ | ౦ | |
| పప్పు ,, | ౧౨ | ౦ | ౦ | |

గమనిక:-

ధరలు వీలైనంతవరకు సరియైనవిగా తెలుపుదుము. అయినను ఏమైన పొరపాట్లుండిన దానికి పత్రికవారు బాధ్యులుకారు,

# నిజాంరాష్ట్ర ఆంధ్రమహాసభ స్థాయిసంఘకార్య నివేదిక

## వి॥ చైత్ర శు॥ ౧ నుండి వృ॥ సం॥ వైశాఖ బ॥ ౩౦ వరకు

౧౮ వతేదిని ౧౩౪౯ం ఫస్లినాకు సమావేశమైన స్థాయిసంఘమునందు అంగీకరింపబడినట్టిది.

మల్కాపురమునందు సమావేశమైన సప్తమాంధ్రమహాసభలో ౨౩ తీర్మానములు అంగీకరింపబడెను. ప్రభుత్వశాఖలకు సంబంధించినతీర్మానములు ఆయాశాఖలకు పంపుకోవబడెను కాని వాటిపైప్రభుత్వమువారు ఏమిచర్యతీసికొన్నది తెలుపనందున వివరములు తెలుపజాలకున్నాము.

ఈ స్థాయిసంఘసమావేశములలో అంగీకరింపబడిన ముఖ్యమైనతీర్మానములు ఈక్రింద తెలుపబడుచున్నవి

ఆంధ్రమహాసభ ఈక్రిందివిధముగ విభజింపబడినది.

౧. జిల్లాసంఘములు ౨. తా॥ సంఘములు

౧ పట్టిసంఘములు అనగా ఒకగ్రామములోని (౧౫-౨౦) గ్రామాదులనుచేర్చి ఆగ్రామాదులలో ఉద్యమముయొక్క కార్యములనునడిపించుట. ఈపట్టిసంఘములు తాలూకా సంఘమునకులోబడి దానియాజమాన్యమున పనిచేయును పట్టిసంఘములో ఏగ్రామముకూడ కేంద్రమునకు ౫ మైళ్ళకన్న ఎక్కువదూరమునసుండకూడదు.

౨ తాలూకాసంఘములు జిల్లాసంఘమునకులోబడి దానియాజమాన్యమున పనిచేయును

౩ జిల్లాసంఘములు స్థాయిసంఘము, కార్యకారిణీసభకులోబడి పనిచేయును

### నిర్మాణకార్యక్రమము

౧ పట్టిసంఘములో పనినడిపించుటకు ఒకఆర్గనైజరు వేతనముపై నియమింపబడును. వేతనము ౨౦-౨౫ వరకుండును. ఆర్గనైజరుకు సైకిలుండుటఅవసరము. ఈఆర్గనైజర్లు పట్టీసంఘకార్యకర్తల నిగ్రానీలోపనిచేయుదురు.

౨ పట్టిలోచేరిన గ్రామాదులకు ప్రతిరోజు ఉదయమునుండి దౌరాచేసి సాయంత్రము పట్టికేంద్రమునకు చేరవలయును.

౩ గ్రామాదులలోని రైతులు, ఇతరవృత్తులవారి అవసరములనుకనుగొని వాటికై సహాయసహాయములుచేయుట

(తాలూకా జిల్లా సంఘమువారిద్వారా) చేయదగిన సహాయములు

జమాబందీ మురాఫాలు తలపుమాలుదరుఖాస్తులు ఎప్పుడివ్వవలెను ఎచ్చటివ్వవలె రైతులకు తెలిపి వారిచేదరుఖాస్తులుయిప్పించుట పైరుపంటలు సరిగాలేక నష్టపడుసందర్భమునమాఫీలకు బరాయిందాలకు దరుఖాస్తులు యివ్వవలసినవిధానము తెలియజేయుట. వ్యవసాయపుపనిముట్లు (కర్రకలప) అటవిశాఖనుండి తీసికొనుటకై ఏర్పాటులుచేయించుట. దస్తావేజుల రిజిస్టరీ పట్టామంతఖిలి మొదలగువిషయములలో అవసరమగు సదుపాయములు కల్పించుట. వర్తకులకు లైసన్సులు, యితరయిబ్బందులకై తగినఏర్పాటుగావించుట పైరులు క్రిమికీటకములతో నష్టపడుసందర్భమున వ్యవసాయశాఖవారి సహాయము, మరియు పశుచికిత్స అంటువ్యాధుల సందర్భమున వైద్యసహాయము లభింపజేయుట పాఠశాలలున్న గ్రామాదులలో రాత్రి వయోజన పాఠశాలకై స్థానికులను ప్రోత్సహించుట పాఠశాలలు లేని గ్రామాదులలోస్థానికులను ప్రోత్సహించి బడులు స్థాపింపజేయుట దేశీయ వస్తువులు, ఖాదీవాడుటకు యింకాఏదేని స్థానికపరిశ్రమలున్నచో వాటికిప్రాముఖ్యతనిచ్చి రైతులకు, బీదలకుపనిపాటలు కలగించుటకై యత్నించుట. పఠనాలయములు స్థాపించి గ్రామవాసులలో పత్రికాభిరుచి కలిగించుట పట్టికేంద్రమందు రాత్రిసమయమందు వయోజనపాఠశాల నడిపించుట (ఆర్గనైజరు స్వయముగ) పట్టీకేంద్రమందు శారీరకబలము కలిగియుండుటకు దేశీయ వ్యాయామములందు అభిరుచి కలిగింపజేయుట గ్రామములలోని వీధుల వసతుల పరిశుభ్రతకైయత్నించుట

కార్యకారిణీ సభలు

ఈనివేదికకాలమున కార్యకారిణీసభ ౧౪ (౧౪) సమావేశమయ్యెను- (౨) మాత్రము కోరము పూర్తికానందున పని జరుగలేదు-

ఈ కార్యకారిణీసభలలో అంగీకరింపబడిన ముఖ్యతీర్మానముల వివరము-

జమాబందీకిసంబంధించిన సర్వసాధారణ సమస్యలలో మురాఫాలుచేయుటకు అవసరసహాయము కలిగించుట-

ఆంధ్రమహాసభ జాతీయసంస్థయైనందున ఈ సంస్థ కార్యకర్తలు మతపాక్షికసంస్థలలో చేరకూడదని నిషేధించుట-

ఆదిలాబాదజిల్లాలో గోండులపైనజరిగిన కాల్పులవిషయమున విచారణసలుపుటకు ప్రభుత్వమునుకోరుట-

జిల్లాసంఘములు కనీసము (౧౦౦౦) ప్రాథమికసభ్యులను చేర్చవలెనని విధించుట-

అధ్యక్షులవారు నల్లగొండ,ఆత్రాపుబల్దా భాగాయతు, వరంగలు,కరీంనగరం,మహబూబునగరం-మెదకుజిల్లాలలో విరివిగా పర్యటనసలిపిరి-మొత్తము(౩౬)తాలూకాలు(౧౨౦)గ్రామములకువెళ్లిరి- మొత్తము(౪౮)రోజులలో (౪౩౦-౪-౦) వ్యయముతో సుమారు (౪౫౦౦)మైళ్ళు పర్యటన ఈనివేదికకాలమున జరిగెను-పర్యటనకొరకు జాపబడినఖర్చు స్థాయిసంఘము భరించినది- కొన్నిచోట్లలో స్థానికఅధికారుల ఒత్తిడివల్లకాబోలు ప్రజలు సమావేశములకుకాని కార్యకర్తలతో కలియుటకుకాని రాలేదు- ఇట్టిపరిస్థితులేర్పడినచోట అధ్యక్షులవారుస్వయముగా రైతులయిండ్లకేగి సంగతిసందర్భములను తెలిసికొనిరి- ఇంతకు తెలంగానాప్రాంతమంతటను పర్యటన సలుపవలయునను మాఉద్దేశ్యము పూర్తికానందుకు చింతిల్లుచున్నాము- ఆదిలాబాదులో ఉద్యమము బలపడనందున పర్యటనజరుగలేదు- మరియు నిజామాబాదలోని స్థానిక కార్యకర్తలవల్ల సహకారములేని కారణమున నిజామాబాదజిల్లా పర్యటనకై మేము చేసినకృషి ఫలవంతము కాకపోయెను-

ఈనివేదికకాలమున నాలుగు జిల్లా మహాసభలు జరుపుటకు సన్నాహములు జరుపుకొని సర్వవిధముల ఏర్పాటులన్నియు సిద్ధపడియుండినవి. వరంగలుజిల్లా మహాసభకు ఆ జిల్లా కార్యకర్తలు విసుగు,విరామములేని ఓర్పుతో పెండాల నిర్మాణము, మున్నగుఏర్పాటులన్నియు చక్కగా జరిపిరి-జిల్లాలోని ఉదారవంతులగు దాతలు విరివిగా విరాళముల నొసంగిరి- వ్యయప్రయాసలకోర్చి అన్నివిధములుగా సిద్ధపడిన మహాసభకు యింతవరకు యెన్నడులేనిషర్తులు విధించబడినందున ఆశాహతులై షరతులు ఆచరణయోగ్యమైనవి కాక అవమానకరముగ నున్నందున గత్యంతరములేక అపుటయే ఉద్యమమునకు శ్రేయస్కరమని తలచి మహాసభను ఆపివేసిరి.

నల్గొండజిల్లా మహాసభను (హుజూరునగరంలో) ఇదేవిధమైనషరతులు విధించబడినందున ఈ జిల్లా మహాసభకూడ నిర్ణయమైన తేదులలో జరుగక ఆగిపోయెను-

మహబూబునగరంజిల్లా మహాసభకు యింతవరకు అనుమతి లభించనందున ఈ మహాసభకూడ ప్రకటిత తేదులలో జరుగజాలలేదు-

మెదకుజిల్లా మహాసభకు ప్రాథమిక ఏర్పాట్లన్ని జరిగెను-కాని పైఅనుభవములనుబట్టి తర్వాత చేయవలసిన సన్నాహములను ఆపవలసివచ్చెను-

ఈనివేదికకాలమున దేశీయులకు సంఘటించినసంకటములనుగూర్చి స్థాయిసంఘము సేకొన్నచర్యసంగ్రహముగా ఈక్రిందపొందుపరుపబడుచున్నది

కరీంనగరంజిల్లాలో పోయినసంవత్సరము తుఫానుపీడితులైబాధపడుచుండగా ఈసారిఎక్కువ వర్షములవల్ల మొలకలుచెడి పైరుపంటలునష్టపడిరైతులుపన్నులుచెల్లించజాలక కడుదుర్భరస్థితిలోచిక్కుకొనిస్థానికాధికారులకు మొరలపెట్టుకొన్ననువారిఉపేక్షవల్ల లాభముకలుగక ఆశాహతులై స్థాయిసంఘసహాయమును ఆపేక్షించిరి. శ్రీ అధ్యక్షులవారు రైతులమొరల యాథార్థమును విచారించుటకుజిల్లాకమిటీ ప్రముఖు యుక్తముగా కరీంనగరంజిల్లాలోని తాలూకాలలో, గ్రామాదులలోవిరివిగాపర్యటనసలిపిరి రైతులవాఙ్మూలములను గైకొనిరి. వారిపంటలఅంచన, ఖర్చుల అంచనసిద్ధముచేసికొనిరి వీటియన్నిటియాధారముపైనప్రభుత్వపుమాలుశాఖా కార్యదర్శి గారికి నివేదికనుపంపుచుమాఫీలకై, బరాయిందాలకైకోరిరి. తుదకుఒకరైతురకం చెల్లించజాలక ఆత్మహత్యచేసికొన్నవార్తఅందగనే దానినిపురస్కరించుకొనిమాలుశాఖవారిని మరలకోరిరి. దీనిపైనప్రత్యేకముగాసూబేదారుకు ఉత్తరవుఅయ్యికాలు బరాయిందాచేయబడెను ఈవిధముగా ప్రయత్నములు సఫలమైనవి. ప్రభుత్వోన్నతాధికారులు చూపినఔదార్యమునకు మేముకృతజ్ఞులము.

ఆదిలాబాదజిల్లాలోని ఆడవులలోనివసించినట్టిగోండులపై స్థానికప్రభుత్వాధికారులు తుపాకులుకాల్చిరి. పశుప్రాయులైన అటవికులగుగోండులనుతుపాకులతోకాల్చి ప్రాణములుతీయునంతటివిషమపరిస్థితులు ఏమియుండెనో నేటికిని గ్రాహ్యముకాకున్నవి ఈఘోరదురంతమును గూర్చి కార్యకారణిసభవారు ఒకతీర్మానమును అంగీకరించిరి, అందునిష్పాక్షికమైన ఒకబహిరంగసభలోగోండులకాల్పులవిషయమైనవిచారణజేయింపబడవలెనని ప్రభుత్వమువారిని కోరడైనది-

విదేశస్థులైన ఈరానీలమురాలు ఆయుధములతోసహాగ్రామములకు వెళ్లుచు, ప్రజలనుకొట్టుచుతిట్టుచుగ్రామములను దోచుకొందుమని భయపెట్టుచుబలవంతముగా ఊరూరవందలకొలదిరూపాయిలువసూలు జేసుకొనుచు నానా భీభత్సము చేయుచున్నారు- నేటికినిస్థానికపత్రికలలో వీరుజేయు దౌర్జన్యముల వార్తలు వచ్చుచునేయున్నవి. యింతయైననుస్థానికాధికారులు ముఖ్యముగాపోలీసువారు మౌనమువహించుటలో తప్పకఅర్థమున్నదని ప్రజలుఅనుమానపడుచున్నారనిన ఆశ్చర్యపడవలసిన అవసరములేదు ఈవిషయమునజిల్లాతాలూకాదారుగారితోను మరియు సదరునాజీంగారి (పోలీసు అజ్ఞా)తోను పత్రవ్యవహారముజరుపనైనది,

వైరాప్రాజెక్టురైతులు అధికపన్ను భారముచేసిస్తులుచెల్లించజాలక క్రుంగిపోవుచు ఆంధ్రమహాసభద్వారావిరివిగా ప్రభుత్వమునకు మొరపెట్టుకొనుచువచ్చిరి, బందోబస్తుజరిగి ప్రకటనకానందునఅందుకైప్రయత్నింపబడెను, ప్రకటన ఆయినపిదపమాలునియముల ప్రకారము మరుసటిసంవత్సరమునుండిరకాలు వసూలుకావలసి వుండెను. కానిపన్నులుతగ్గింపబడినందున రైతులుయిదే సంవత్సరము ప్రకటనప్రకారము అమలు జరుగవలెనని కోరుచుస్థాయిసంఘ సహాయమును ఆపేక్షించిరి స్థాయిసంఘపక్షమునను, జిల్లాసంఘ పక్షమునను ఈవిషయమున న్యాయసహాయము ఉచితముగా చేయబడెను. తుదకు ప్రభుత్వమువారిచే రైతులకోరికఆమోదింపబడి నూతనప్రకటన ప్రకారముఅమలుజరుపబడెను దీనివల్లవైరారైతులకుండిన అధికపన్నులభారముకొంతవరకు తగ్గినందులకు సంతసించుచున్నాము

సాధ్యమైనంతవరకు ఉచితన్యాయసహాయము తదితరఅవసరములనుపూర్తిచేయబడెను వీటిలో ముఖ్యమైనవి జమాబందీ, తలపుమాలు. (పైరునష్టము)

కోస్గితాలూకా (నవాబుసాలార్ జంగు బహద్దరుగారి యిలాఖా) లోపోయిన సంవత్సరము అదివరకు అక్కడవుండినఅక్రమపన్నులు (ధడ్వాయిపన్నువగైరా) తొలగిపోయినవని గతస్థాయిసంఘనివేదికలో తెలుపబడెను ఈసారియిదే తాలూకాలోమాఫీలు యివ్వనందున రైతులుపడుచున్న బాధలను పర్యటనసందర్భమున అధ్యక్షులవారు కండ్లారచూచిఅచ్చటి రైతులకుసమయోచితసలహాలనిచ్చి న్యాయసహాయమునకై ఏర్పాటుచేయించిరి దీనిపైవారికిమాఫీలులభించెను

ఇదిగాకపోలీసువారుపెట్టుయిబ్బందులనుగూర్చియు, సర్కారీనౌకరులు బలవంతముగా చేయించుకొను వెట్టినిగూర్చియు, జాగీర్దారులును వారినౌకరులునుచేయు అక్రమములను గూర్చియు తదితరకష్టనష్టములను గూర్చియు తెలంగానాలో విదాదాపు అన్నిప్రాంతములనుండియు మాకుశేఖలందినవి. బాధ్యతగలసంబంధాధికారులతో పత్రవ్యవహారములను జరిపియు, దర్శించియు మాకుచేతనైన సహాయముచేసితిమి

### నిర్మాణకార్యక్రమము

నిర్మాణకార్యక్రమమును ఆచరణలోపెట్టినప్పుడే ఉద్యమముఫలవంతమగుననియు, స్థానికస్థిరత్వముకచ్చునియుతలంచి ఒక పథకసిద్ధముచేసి దానిని జిల్లాసంఘములకు అభిప్రాయార్థముపంపించితిమి అది ౧౪వ బహమను నాడు సమావేశమైన స్థాయిసంఘముచేఆమోదింపబడిఆచరణయందుంచబడెను జిల్లాసంఘములతర్వాత తాలూకా పట్టిమరియు గ్రామసంఘములు స్థాపింపబడెను. పట్టిసంఘమునందు వేతనముపొందిన ఆర్గనైజరుండును అతనుప్రతిరోజు కనీసమొక గ్రామమువెళ్లి అక్కడిపరిస్థితులు తెలిసికొని సహాయము కలుగజేయుటకుప్రయత్నించును పాఠశాల, పఠనాలయము, గ్రంథాలయము, పరిశుభ్రత మొదలగు విషయములతోబాటు తలపుమాలు, జమాబందీవెట్టి మొదలగువిషయములలో గ్రామవాసులకు సహాయముచేయించును ఇంతటిబాధ్యతగలవారు సుశిక్షితులైయుండుట అత్యవసరమనియెంచి శిక్షణశిబిరముఏర్పాటుచేయబడెను పరీక్షార్థము జిల్లాకొకరుచొప్పున నియమింపవలయునని ౧౫గురిలోనుండి [illegible] గురినిఎన్నుకొని ౯ మూరు రెండు వారములు రిత్యాసారములగు శాసనములు, చట్టములు మరియు ఉద్యమమునకుసంబంధించిన పలు

# ఫ్రాన్సు జర్మనీల క్రొత్త సహకారపు షరతులు

## ఫ్రెంచి నౌకాశ్రయాలను జర్మనులు ఉపయోగించుకొనవచ్చును

### అమెరికావారి ఆగ్రహము

జర్మనులకులొంగిపోయినది కాబట్టి, దానితో ఈజాప్తువారువ్యాపారంచేయరాదని ఈజిప్టుప్రభుత్వమువారుఆజ్ఞ చేసినారు.

ఇటీవల విషీలో ఫ్రెంచిప్రభుత్వమువారు జర్మనులఒత్తిడిపై చేసికొన్న ఒక తీర్మానములో ఫ్రెంచివారికాలనీలు ఎక్కడనున్నను, వాటిపైకి ఎవరుదండెత్తివచ్చినను ఫ్రెంచిసేనలు ప్రతిఘటించిపోవలెననియున్నది. ఇపుడు సిరియా, మున్నగు ఫ్రెంచి కాలనీలలోనికి జర్మనులు అనేకమంది ప్రవేశించినతర్వాత ఇట్టిఆజ్ఞ చేయుటలోఅర్థమేమనగా, ఇకఎవరైననుదండెత్తితే ఆ జర్మనులతోపోరాడుటకై వచ్చేటటువంటి డీగాలు పక్షీయులో బ్రిటిషువారో మాత్రమే అయియుందురుగనుక వారితో యుద్ధముచేయవలెననియే. విషీప్రభుత్వమువారి ఇంకొకతీర్మానములో ఇంతవరకు పరాక్రాంతమైన ఫ్రెంచికాలనీలను తిరిగి రాబట్టుకొనుటకై ఫ్రెంచిసేనలు యుద్ధము చేయవలెననియున్నది అనగా డీగాల్ గారిసేనలతోపోరాడి వారలువశపరచుకొన్న ఈక్వెటోరియల్ ఆఫ్రికాలోనికాలనీలను తిరిగివశపరచుకొనవలెనన్న మాట

ఫ్రెంచిసర్వసేనానియగు వేగాండు గారు ఉత్తరఆఫ్రికానుండి జూను ౩వ తేదివిషీకిచేరెను. తర్వాత ఫ్రెంచివారి పడమటిఆఫ్రికానుండి అక్కడి గవర్నరుజనరలుఅగు బొయిసన్ గారును, ఫ్రెంచివారిటునీషియాలో రెసిడెంటుజనరల్ అగు అడ్మిరల్ ఎస్టెవా గారుకూడ విషీలో చేరిరి. వారలు ఫ్రెంచిసామ్రాజ్యమును బ్రిటిషువారిదండయాత్రలనుండి రక్షించుటకు మార్గములను గూర్చి ఆలోచించిరి. ప్రస్తుతముసిరియాపై బ్రిటిషువారిదండయాత్రజరుగుచో ప్రతిఘటించు పని పూర్తిగా వేగాండు గారికి అప్పగించబడినది. వేగాండుగారు ఇంతవరకుసిరియావిషయంలో అడ్మిరల్ డార్లాను గారుఅనుసరించిన విధానములో అనేకములైన పొరపాటులు సంభవించినవని తలచుచున్నారు.

జూను ౭ తేది రాత్రి సిరియా హైకమిషనరగు జనరల్ డెన్జుగారు బేరుటు రేడియోనుండి ఉపన్యసించుచు సిరియావిషయంలో "దెబ్బకుదెబ్బతో సమాధానమిచ్చెదము" అని చెప్పి, ఫ్రాన్సు సజీవముగానుండుటకై జర్మనీతో సహకారముచేయుట తప్పదని చెప్పిరి.

ఇదివరలో బ్రిటిషువిమానములు సిరియాలోని బేరూట్ పై బాంబులనువేసియుండెను. దానికి బదులు దెబ్బతీయుటకై ఫ్రెంచివిమానాలు జూను ౭ తేదిన బ్రిటిషువారి ట్రాన్సుజోర్డానియాలోని అమ్మానుపై బాంబులనువేసినవని ఒకవార్తవచ్చినదికాని రూటరు మహాశయుడు అదిఉత్తమాట యనుచున్నాడు.

ఇప్పుడుజర్మనులు సిరియాలోని డమాస్కస్, అలెప్పో, పల్మైరాలనువిమానాలరేవులను గట్టిగాఆక్రమించిరట. సిరియా, రోడ్సుమధ్య నాజీవిమానాలసంచారము జరుగుచునేయున్నదట.

ఇదివరలో ఫ్రెంచిఇండోచైనా గవర్నరుగనుండిన జనరల్ కాట్రూగారు ఇపుడు జనరల్ డీగాల్ గారి పక్షములో చేరినారట.

### హిట్లరు ముసోలినీల సమావేశము

జూను ౨ వ తేదిన ఆస్ట్రియా, ఇటలీల మధ్య సరిహద్దునందు బ్రెన్నర్ కనుమవద్ద హిట్లరు, ముసోలినీగారలు తమతమ విదేశాంగమంత్రులతోను, ప్రధాన సేనాధిపతులతోను సమావేశమై కొన్నిగంటలు సంభాషించిరట. ఈసంభాషణలనుగూర్చి ఇటాలీయాధికారులు చేసినప్రకటనలో యూరోపులో నూతనవ్యవస్థ నేర్పాటుచేయువిషయమై సంభాషణలుజరిపినట్లును హిట్లరు, ముసోలినీలకు ఏకాభిప్రాయము కుదిరినట్లును చెప్పబడినది. ఇంతకుమించి మరేమియు చెప్పబడలేదు. కాని పత్రికలవిలేఖకులు కొందరు ముందుజరుగవలసిన యుద్ధకలాపమునుగూర్చికూడ చర్చలు జరిగినట్లును ఊహించుచున్నారు. గ్రీసుయుద్ధంలో ఇటలీఎన్నాళ్ళకును విజయమునందలేక అపజయములనుకూడ పొందుచుండినందువల్లను, ఆఫ్రికాలోకూడ ఇటలీసేనలు జర్మనులసహాయముచేయుటకుముందు అపజయములనందుచుండినందువల్లను, అప్పటినుండి ముసోలినీపై హిట్లరుఅభిమానము తగ్గుచున్నదనియు, ఇపుడు సిరియామున్నగుచోట్లయందు బ్రిటిషువారితోసాగించవలసినయుద్ధములో ఫ్రెంచిప్రభుత్వముయొక్క సహకారము అవసరముగానున్నందువల్ల హిట్లరుకు ముసోలినీని సంతృప్తిపరచుటకంటె ఫ్రెంచివారినిదువ్వుట ఎక్కువ ముఖ్యమైనదనియు, అందుచే జూను ౨ వ తేదినాటి సమావేశములో హిట్లరు ఇటలీ రాజాబంధువుకు క్రోషియా సింహాసనమునిచ్చుటకంటె ఎక్కువనేమియు ఇటలీకిచ్చేదిలేదని చెప్పెననియు అనివిలేఖకులనుచున్నారు ముసోలినీ ఇటలీకొరకు ఫ్రెంచివారి నీస్, కార్సికా, ట్యూనిస్ అను ప్రదేశములను కోరుచుండెననియు, వాట్లనుఇపుడు ఫ్రెంచివారిని సంతృప్తిపరచుట ఎక్కువ ముఖ్యమైనందున, వాటిని ఇటలీకిఇచ్చుటకు నిరాకరించెననియు అనివిలేఖకులు ఊహించుచున్నారు

### జర్మనీఫ్రాన్సులసహకారము

ఫ్రెంచిప్రభుత్వములో ఉపప్రధానియగు అడ్మిరల్ డార్లాన్ గారు అప్పుడప్పుడు జర్మనులఅధికారులతో సంభాషణలుజరుపుచునేయున్నారు ఆసంభాషణలఫలితంగా ఫ్రాన్సుజర్మనీలసహకారపు ఒడంబడిక షరతులీదిగువవిధముగ నున్నవని బ్రిటిషువిలేఖకులనుకొనుచున్నారు

లొరెయిను అనునది ఒకఫ్రెంచిరాష్ట్రము. దాని పరిహద్దులో కొద్దిమార్పులు చేయవచ్చునుగాని, మొత్తముమీద ఆరాష్ట్రమును, ఆల్సేసును జర్మనులు జర్మనీ ప్రభుత్వపరిపాలనలో చేర్చుకొందురు, పాస్‌డీకలె, హాలెండు, బెల్జియంలో ఫ్రెంచిప్రజలు ఎక్కువగాఉండేవిభాగముకూడ జర్మనీప్రభుత్వముక్రింద చేర్చబడును బ్రిటిషువారితో జర్మనుయుద్ధము ముగియువరకు ఫ్రాన్సుయొక్క ఉత్తరపశ్చిమ సముద్రతీరప్రాంతముజర్మనుఅధికారముక్రిందఉండవలెను ఆల్సేసును, లొరెయినునున్ను విరుద్ధములుగానుండే ఆయినుడిపార్లమెంటులును ఇరువదిఏండ్లవరకు జర్మనీఆక్రమణకు లోబడియుండవలెను. కొన్నినౌకల ఆశ్రయములను ఫ్రెంచివారితోపాటు జర్మనులును ఉపయోగించుకొనవచ్చును. బహుశాఈ ఆశ్రయములుడాకారు, కాజబ్లాంకా అల్జియర్సు, విల్లీఫ్రాన్సు సెట్టు, బేరూటుఅయిఉండవచ్చును, ఫ్రాన్సులో పెద్దపెద్దయంత్రశాలలు జర్మనీవారికి యుద్ధానికికావలసినసరకులను జర్మను అధికారుల ఆజ్ఞానుసారము ఉత్పత్తిచేయవలసియుండును.

ఈపైవాటికిబదులుగా ఫ్రాన్సుకుజర్మనులిచ్చునదేమనగా - ౧ బెల్జియంలో ఫ్రెంచిభాషమాట్లాడువారుండేప్రదేశమును ఫ్రాన్సుకిచ్చివేసెదరు. ౨ ఫ్రెంచిప్రభుత్వము పారిసునగరమునుకేంద్రస్థానముగ వాడుకొనవచ్చును ౩ యుద్ధములోఖైదీలనుగ జర్మనులుపట్టుకొన్న ఫ్రెంచిజనులనుండివ్యవసాయముచేయగలవారలనందరిని యంత్రశాలలలోపనిచేయగలవారలనందరిని వెంటనేవిడుదలచేయగలరు ౪ ఫ్రెంచివారికాలనీలనుండి జనరల్ డీగాల్ గారిసేనలను, వారిప్రభావమునుతొలగించివేయుటకు జర్మనుఅధికారులు మంచిసహాయములనుసలహానిచ్చెదరు, ౫ ఫ్రాన్సులో జర్మనుసేనలనుంచినందుకై ఫ్రెంచిప్రభుత్వమువారిపు డిచ్చవలసివచ్చుచున్నరుసుమును సగానికి(అనగారోజు ౧కి ౨౦౦౦౦౦౦౦ఫ్రాంకులను) తగ్గించెదరు. ౬ ఇటలీ ఫ్రెంచివారిప్రదేశములనుండి కోరుచున్నప్రదేశములను ఇచ్చేమాట వదలుకొనబడును

ఈఒడంబడికషరతులనుగూర్చి ఫ్రెంచిమంత్రివర్గము జూను ౩వ తేదిఉదయము ౨గంటలకుపైగాచర్చించినది అప్పుడాసభలోజనరల్ వేగాండు గారుకూడాఉండిరి. తర్వాతవచ్చినవార్తలలోఒకటి ఫ్రెంచివిమానములు జర్మనుఅధికారులఅనుమతిచే తిరిగిపాలెస్థినుపై సిరియాకును, ట్యూనిసియాకును పోయినట్లున్నది,

ఫ్రెంచివారినౌకాశ్రయములను ఫ్రెంచినౌకలు జర్మనునౌకలునుకలిసి ఉపయోగించుకొనవచ్చునని ఒకషరతున్నదనిపైనచూచినాము, ఇందులో డాకారులోజర్మనునౌకలుచేరుచో, అక్కడినుండి దక్షిణఅమెరికా ౨౦౦౦ మైళ్ళు దూరముమాత్రమే అగుటవల్ల అమెరికాఖండవాసులకుగూడ నాజీలభయము సమీపస్థమైనదగును. మరియుఇప్పుడు పశ్చిమఆఫ్రికా సముద్రతీరమందలిరేవుల నుపయోగించుచున్న బ్రిటిషునౌకలుగూడ జర్మనులకుభయపడవలసియుండును, కనుకనే అమెరికాసంయుక్తరాజ్యపు విదేశాంగమంత్రియగు కార్డెలుహాల్ గారు జూను ౫వ తేదినాడు ఫ్రాన్సుజర్మనీలసహకారము ఇదివరలోచేసికొన్న యుద్ధవిరామసంధిషరతులకంటెమించిజరుగుచో అదిఅమెరికావారిహక్కులకువిరుద్ధముగానుండగలదని హెచ్చరికచేసినారు, ఇపుడుఫ్రాన్సుజర్మనీలోకలిసి ఇతరరాజ్యములపైకిదండెత్తుకార్యక్రమమును ఏర్పాటుచేసికొన్నట్లు తెలియుచున్నదనియు, ఆవిషయమై వివరములను విచారించి తెలిసికొనుటకు అమెరికా ప్రభుత్వము ప్రయత్నించుచున్నదనియు కార్డెలుహాల్ గారు చెప్పిరి

### తుర్కీ, ఫ్రాన్సుల మాటలసంఘర్షణ

ఇటీవల అడ్మిరల్ డార్లాను గారు తుర్కీపై వాగ్యుద్ధము రేడియోభాషణములద్వారా ప్రారంభించినారు దానికితుర్కీ రేడియోలలో సమాధానములుచెప్పుచున్నారు అందొకటియేమనగా అ… నానుగాని, సిరియానుగాని తుర్కీవారు వా… స్వాతంత్ర్యమిచ్చుషరతుపైననే ఫ్రాన్సుకువశ… కొనియున్నారని ఒకతుర్కీపత్రికలో వ్రాయబడినది, తుర్కీలోపీపిల్సుపార్టీయొక్క రహస్యసమావేశమొకటిజరిగినది అందులో విదేశాంగమంత్రి సారజోగ్లు గారుఒకప్రకటనచేసిరట, సిరియావిషయమై ఏదోచెప్పియుందురనుకొనుచున్నారు తుర్కీలోనిఅంకారాలో విషీప్రభుత్వపురాయబారికార్యాలయంలోని ఇరువురుఅధికారులు జర్మనీతో విషీప్రభుత్వము సహకారముచేయుచున్నందున యిష్టపడనివారై రాజీనామాలనిచ్చి డీగాల్ పక్షమునకు పోవుచున్నారు,

సంవత్సరము చందా
౭ హాలీ రూపాయిలు
ఆరుమాసాలకు
౩ రూపాయిలు
బ్రిటిషిండియాలో
సం॥ చందా
౫-౮-౦ కల్దారు.
పాతపత్రికలకు
వెల ప్రత్యేకము.

# గోలకొండ పత్రిక

# Golkonda Patrika

The only Popular Paper That reaches The masses In the Dominions

Best Medium for Advertisement

PUBLISHED ON EVERY MONDAY AND THURSDAY

Volume 16 | Hyderabad-Dn | Thursday 12th June 1941 | Number 12

## అమెరికా విమాన నిర్మాణ శాలలలో సమ్మె

### బ్రిటనుకు జరుగుచున్న అమెరికా సహాయపు స్థితి

**ఇరాఖులో మోసూలు ఆక్రమణము**

ఇరాఖులో బ్రిటిషుసేనలు జూను౭వ తేదిన మోసూలును ఆక్రమించినవి. అక్కడ పెట్రోలుగనులు చెక్కుచెదరక యుండినవి. రషీదలీపక్షముచే ఈపెట్రోలుగనులు ధ్వంసము చేయబడినవి... రషీదు ముఖ్యులందరును అరెస్టుచేయబడియుండి రిగదా! వారలందరును వదలివేయబడినారు.

జూను౨వ తేదిన బాగ్దాదులో పెద్దఅల్లరిజరిగి నందువలన అక్కడి ఇరాఖుప్రభుత్వమువారు పరిపాలనాధికారమును సైనికాధికారుల కప్పగించిరి రెజెంటు అబ్దుల్ ఎలాహిగారితో కూడ వచ్చిన జమీల్ మిద్ ఫాయిగారు రెజెంటుగారి ఆజ్ఞపై మంత్రివర్గము నేర్పాటుచేసినారు. ఈజమీల్ మిద్ ఫాయిగారు బ్రిటిషుపక్షపాతులు. వారిచే మంత్రివర్గమందు నియుక్తులైనవారలుకూడ బ్రిటిషు పక్షపాతులు.

ఛాల్కెడ్ ప్రాంతమందు జాతీసేనల ప్రధానాధిపతి బాగ్దాదునగరముపై బిటిషువిమానముచే క్రిందకూల్చివేయబడి మృతుడైనట్లు రూటరువార్తలోనున్నది.

బ్రిటిషువారు ఆబాదాన్‌లో పెట్రోలుబావుల రక్షణకైతమసేనలను ఇరానుగుండాపోనీయవలసినదని ఇరానుప్రభుత్వమువారిని అడిగినట్లు ఒవు వదంతివ్యాపించగా ఇరానులోనిపత్రికలు అది అసత్యమని జూను౫వ తేదినాడు ఖండించినవి.

ఇరాఖు రెజెంటు అబ్దుల్ ఎలాహిగారు బాగ్దాదుకుపోవుచుండినపుడు జర్మనువిమానములు వారిని చంపవలెనని ఎన్నియోమారులు బాంబులనువేసెనుగాని, అవి నిష్ప్రయోజనములైనవి.

**క్రీటు వ్యవహారంపై అసంతృప్తి జ్వాలలు**

క్రీటులో జర్మనులు పారషూటులలోదిగినపుడు వారలనుకొందరు బ్రిటిషుసైనికులు అక్రమ బాధలుపెట్టిరట. అందుకై బ్రిటిషుసైనికులు కొందరిపై నేరములుమోపి జర్మను సైనికాధికారులచే విచారింపజేయుచున్నారట.

క్రీటులోకిపంపబడిన న్యూజీలెండు సైనికుల లోనుండి ౨౦౦౦మందితిరిగిరాలేదు. ఆస్ట్రేలియా నుండిక్రీటుకుపంపబడిన ౭౫౦౦మందిసైనికులలో ౨౫౦౦మందిమాత్రమె తిరిగివచ్చినారు, బ్రిటిషు సామ్రాజ్యసేనలచే క్రీటులో ౧౫౦౦౦ మంది జర్మనుసైనికులుచంపబడిరి, ౭౦ జర్మనువిమానములుధ్వంసముచేయబడినవి.

క్రీటులో బ్రిటిషువారు గ్రీసు,ఇటలీలయుద్ధం ప్రారంభమైననాటినుండి తమసేనలనుంచియుండిరి.అనగా ౭నెలలనుండిబ్రిటిషుసేనలక్కడ ఉండినవి.కానిఇచటకు జర్మనులుదిగునప్పటికి అవిఖాళీ చేయవలసివచ్చుట ఏలయని బ్రిటనులో పత్రికలు అడుగుచున్నవి. జర్మనులబలమునుగూర్చి బ్రిటిషువారు తప్పుఅంచనా వేసికొనియుండుటయే ఈ అపజయమునకుకారణమని అపత్రికలు ఆక్షేపణలు చేయుచున్నవి. కొన్నియుద్ధకాలపుమంత్రివర్గము ఇప్పటియంత పెద్దదిగానుండుట అనుకూలము కాదనుచు చిన్నదిగాచేయవలెననుచున్నవి, మరికొన్ని ఏఏమంత్రులు సరిగాపనిచేయలేదో వారలనుసరిగాలోలగించవలెననుచున్నవి. అందువల్ల ఈవిషయమునుగూర్చిచర్చించుటకై పార్లమెంటుసమావేశముకూడ జరుగనున్నది. ఈసందర్భములో జూను౭వ తేదిన యడింబరోలో పూర్వబ్రిటిషు యుద్ధమంత్రి హోర్ బెలిషాగారు ఒకసభలో ఉపన్యసించుచు చేసినఆక్షేపణవచనములు గమనించదగియున్నవి.

"మనము ఎప్పుడుపట్టినను ఒకదానివెంటనొకటి అపజయములనేఅనుభవించుచున్నాము.ఎప్పుడుపట్టినను ఒకటేకారణము. సరిగాగ్రహించకపోవుట. అనుకొన్నపనిని సరిగాచేయకపోవుట: బ్రిటిషుసామ్రాజ్యంలోని అత్యుత్తమమైన యుద్ధసాధనసంపత్తిని ముందాలోచనలేకుండా, జాగ్రత్తలేకుండాచేయవలసినపనిని నెరవేర్చు మార్గములను గూర్చి పొరపాటుఅభిప్రాయముతో నటించిపోనిచ్చుట నిజముగాచాలాబుద్ధితక్కువపనియే-మనము ఈయుద్ధంలో గెలువవలెను. గెలుచుటకు చేయవలసినదంతయు చేయునట్టి ఏప్రభుత్వమునుగాని బలపరచగలము. అయితే ౧౯౧౩లో సాగినట్లే సాగినచో ౧౯౪౧లోయుద్ధమును మనము గెలువజాలము." అని వారుచెప్పిరి.

క్రీటులో బ్రిటిషు అపజయమునకు కారణము పనిచేయుచుండిన బ్రిటిషు సామ్రాజ్యసేనలను రక్షించుటకై చాలినంతవిమానబలము బ్రిటనులో లేకుండుటయేయని తేలినది. హోర్ బెలిషాగారును ఆదేమాటచెప్పినారు. అందువల్ల ఇటీవల ఆస్ట్రేలియాలోని యుద్ధాలోచన సంఘమువారు జూను ౫వ తేదినసమావేశమై ఇకమీదటజరిగే యుద్ధచర్యలలో ఆస్ట్రేలియా సేనలకుచాలినంత వైమానిక సంరక్షణసహాయము ఏర్పాటుచేయుట అవసరమని బ్రిటిషుప్రభుత్వమునకు గట్టిగా తెలియచేయవలెననితీర్మానించినట్లును, ఆస్ట్రేలియా ప్రభుత్వమువారుఆవిధముగానే బ్రిటిషుప్రభుత్వమునకు తెలియజేసినట్లును తెలియుచున్నది. జూను౭వ తేదినాడే ఆస్ట్రేలియాప్రధానిమెంజీస్‌గారుపన్యసించుచుఈ సారిజరిగేయుద్ధచర్యలో ఆస్ట్రేలియాసేనలకుకావలసినంత విమానరక్షణసహాయము యివ్వబడునని అభయవచనముచెప్పిరి. ఇదేవిధమైన అభయవాగ్దానమును మధ్యప్రాచ్యమందుఉండే న్యూజీలెండు సేనలవిషయంలో న్యూజీలెండు ప్రధానికూడ ఇచ్చెను.

**అమెరికా సన్నాహములు**

జర్మనులకువిజయముగలిగినచో అమెరికాఖండముమీదికికూడ వారుదూకుటకు యత్నించగలరని అమెరికాప్రభుత్వమునకు భయముగలదు, అందుచేవారు జర్మనీబ్రిటనుతోటి యుద్ధంలో నెగ్గకుండ పోవుటముఖ్యమనితలచి బ్రిటనుకు అవసరమైన విమానములను, నౌకలను, యుద్ధసామగ్రిని అంతకంతకెక్కువగా పంపించుచున్నారు. ఈ సామగ్రియంతయు మధ్యమార్గమునసముద్రంలో శత్రుజలాంతర్గాములచే ముంచబడకుండ బ్రిటనుకుచేరుటకై అమెరికానౌకలు సముద్రమార్గమున కాపలాకాయుచు శత్రుజలాంతర్గాములెక్కడెక్కడదాగియున్నదితెలుపుటకు ఏర్పాట్లు చేయబడినది. ఈయేర్పాటులఫలితము ఎంతమాత్రము తేలినది అమెరికానౌకాధికారులు ఇంకను నిర్ధారణగా తెల్పలేదు. జర్మను ఇమాత్రము ఇంకనుఎక్కువగా అమెరికను యుద్ధసామగ్రిఉండే నౌకలను ముంచివేయుచున్నట్లు చెప్పుచున్నారు-కాని బ్రిటిషువారు జర్మనులుచెప్పినన్నినౌకలు ముంచబడలేదనిచెప్పుచున్నారు, ఈయుద్ధసామగ్రిని అమెరికానుండిబ్రిటిషువారు తమనౌకలలోనే తీసికొనిపోవలసియుండును. అందువల్ల బ్రిటిషువారి నౌకలకు ఎక్కువనష్టముకలుగుచున్నది. ఈనష్టమును పూడ్చుటకై అమెరికావారుచేయబూనిన మొదటిసహాయమేమనగా కనడా, అమెరికాలనుండి ఆస్ట్రేలియా, న్యూజీలెండులకు బ్రిటిషునౌకలు సాగించుచున్న వ్యాపారమునంతయు అమెరికానౌకలకు ఒప్పచెప్పబడనున్నది.అందుచేత బ్రిటిషునౌకలుబ్రిటిషువారియుద్ధావసరములకొరకైవిడుదలకాగలవుఇదేపద్ధతిగామరికొన్నిచోట్లబ్రిటిషునౌకలుచేసేపనులనుఅమెరికానౌకలుస్వీకరించిబ్రిటిషునౌకలను బ్రిటిషువారియుద్ధకార్యాలకైవిడుదలజేయుచున్నవి, ఇంతేకాకఅమెరికాకంపెనీల వర్తకనౌకలనుకూడ అమెరికాప్రభుత్వమువారుబ్రిటిషువారియుద్ధకార్యాలకు ఇచ్చుటకైజమజేయుచున్నారు.ఈభూమండలములోనిపశ్చిమార్ధమునంతటిని తమనౌకలతోను, విమానములతోను జర్మనులదాడినుండిరక్షించుటకు అమెరికావారు పూనుకొని, అందుకైతమనౌకాబలమును, విమానబలమును, సైనికబలమునువృద్ధిజేయుచు ఆపశ్చిమార్ధమునందు అక్కడక్కడకీలకస్థానములలోనుంచు ఏర్పాట్లుజేయుచున్నారు. పశ్చిమార్ధమున ప్రదేశములోను ఆప్రదేశమునకుసమీపమునను బ్రిటిషువారిసామ్రాజ్యభాగములున్నవి. కాబట్టి ఆభాగములకు అమెరికావారినుండి రక్షణసహాయము చేకూరుచున్నది.

విమానములను అమెరికాలోఅంతకంతకు ఎక్కువగాఉత్పత్తిజేయుచున్నారు. ఇపుడు౫౦౦౦విమానములను ౩౭౧౦౦౦౦౦౦౦డాలర్ల ఖర్చుతో నిర్మింపజేయవలసినదిగా ఆజ్ఞలీయబడియున్నవి. మొత్తముమీద నెలకు౫౦౦౦విమానాలను (బాంబులనువేసేవాటిని) ఉత్పత్తిజేసేరోజులను త్వరగారప్పించుటకై ప్రయత్నములుజేయబడుచున్నవి. బ్రిటిషువిమానములను నడిపించుటకుకావలసిన వైమానికులనుకూడ అమెరికాలోతగినశిక్షణనిప్పించి తయారుజేయుటకు అమెరికావారుఅంగీకరించినారు.

ఇదేసమయంలో దురదృష్టవశమున ఇపుడు విమానాలనుఉత్పత్తిజేసే రెండుఅమెరికా యంత్రశాలలలో పెద్దసమ్మెలుఉదయించినవి. పసిఫిక్ సముద్రతీరమందు ఒకకంపెనీవారి విమాననిర్మాణశాలలో జూను ౫వ తేదిన ౧౨౫౦౦ మంది పనివాండ్రుసమ్మెకట్టినారు. కాలిఫోర్నియాలోని ఒకనిర్మాణశాలలో ౯౦౦౦ మంది పనివాండ్రు సమ్మెకట్టుటచే ౧౯౨౦ లక్షల డాలర్లవిలువగల విమానములు బ్రిటిషువారికి సప్లయికాకుండపోవుచున్నవి. పోయిన జనవరినుండియే ఈసమ్మెలు ప్రారంభమైనవి. ఇపుడు అమెరికాశాసనసభయగు సెనేటులో ఒకసభ్యుడు ఇట్టిసమ్మెలువచ్చిన విమాననిర్మాణశాలలను ప్రభుత్వమువారేస్వాధీనపరచుకొని పనిజరిపించుటకు అధికారమిచ్చునా సనము ప్రవేశపెట్టినాడు. న్యూయార్కులో సామగ్రులను నిలువయుంచుశాలలు ౭౮ ఉన్నవి. వాటిలో లక్షలకొలది డాలరులవిలువగల యుద్ధసామగ్రి బ్రిటనుకు పంపవలసిఉన్నది. ఈసామగ్రి రక్షణశాలలలోపనిచేయు ౧౮౦౦ మందిపనివారలు జీతములను హెచ్చించవలెనని కోరుచున్నారు. కానివారలనాయకులు ఈపనివారలసమ్మెవల్ల బ్రిటనుకు సరకులు చేరకుండ చేయరాదని ఒప్పుకొనుచునేయున్నారు. ఈసమ్మెలఆటంకములవల్ల అమెరికానుండి ఇంకాఎక్కువగా బ్రిటనుకు చేరవలసినసహాయము చేరకుండ ఆగిపోవుచున్నది. బెల్జియంమంత్రియగు గట్‌గారు అమెరికాకు ఇటీవలపోయియుండిరి. వారు జూను ౫వ తేదిన లండనుకుచేరినపుడు చెప్పినదేమనగా అమెరికాలో యుద్ధసాధనసామగ్రులఉత్పత్తి అమెరికాయుద్ధంలో చేరిననేగాని అత్యుచ్చస్థితికి రాజాలదుకాని ఇపుడు అమెరికావారు బ్రిటిషువారికి గొప్పసహాయమునే చేయుచున్నారు బ్రిటనునుండిఅమెరికా కీలకనౌకావిమాన, సైనికాశ్రయములను కౌలుకుపుచ్చుకొని బ్రిటనుకు అప్పునిచ్చేఏర్పాటులను చేయు అధికారియగు హారీహాఫ్‌కిన్సుగారు అమెరికాలో తయారుచేయబడుచున్న విమానములు బ్రిటిషువిమానములుకలిసి ఇంకఒక్కసంవత్సరములో ఇపుడుజర్మనువిమానముల మొత్తంబలంతో సమానస్థితికిరాగలదని జూను ౭వ తేదినాటి ఒకపత్రికయందలి వ్యాసంలో వ్రాసినారు.

జర్మనులబలమును తగ్గించుటకు అమెరికావారు తమదేశపుబ్యాంకులలోనుండే అమెరికా ఇటలీల ద్రవ్యమును అమెరికాకుపంపించకుండ ఆజ్ఞ చేయదలచినారు కాని జర్మనులు అట్టిఆజ్ఞవచ్చునని ముందుగనే పసిపట్టి అమెరికానుండి తమద్రవ్యమునంతయు తెప్పించుకొన్నారట.

12వజూన్ 1941 మొదలు

రెండవ వారము.

సాంఘిక చిత్రము

# ప్రభాత్

నటీనటులు:-

శాంతాహుబ్లీకర్

జయరాజ్—వాట్సాల్

కల్యాణి

మిర్జాముషాఫ్

## దిల్ షాద్ టాకీస్

సుల్తాన్ బజారు హైదరాబాదు



**రాత్ బోనుకన్య వ్యాసమునుగూర్చి**

## గాంధిగారి అభిప్రాయము

రాత్ బోనుకన్యగారి వ్యాసమునుగూర్చి గాంధిమహాత్ముని అభిప్రాయమేమని "హిందూ" పత్రిక వర్తావిలేఖరి జూను ౭వ తేదిన విచారించగా, మహాత్ముడు సమాధానంగా టాగూరుగారు ఇచ్చినజవాబు తర్వాత నేనేమైనను చెప్పవలసినది ఉన్నదా? లేదు అనిచెప్పిరట.

**కిసాన్ నాయక సత్యాగ్రహివిడుదల**

సత్యాగ్రహముచేసి ఎట్టవాడ జెయిలులో శిక్షననుభవించుచుండిన కిసాన్ నాయకుడగు స్వామి సహజానందు గారు జూను ౭వ తేదిన శిక్షానుభవకాలముపూర్తియగుటచే విడుదలచేయబడిరి.

**వైదిక ధర్మోపన్యాసము**

రేపుశుక్రవారము సాయంత్రం ౫గం. లకుంచి బోయినపల్లి తోటలో శ్రీమాన్ బిహారిలాల్ [కావ్యతీర్థశాస్త్రి]ధమహారథి గారును, పండిత నరేంద్రగారును మ, రా, శ్రీ, బి, ప్రతాపరెడ్డిగారి కాంపౌండులో వైదికధర్మోపన్యాసాలు చేసెదరు, స్త్రీలకు ప్రత్యేకస్థలము,



## కావలెను

మెట్రిక్యులేషన్ పరీక్షకుపై వేటుగా చదివి హైద్రాబాదులోజరుగు పరీక్షలకు కూర్చొనువారు కావలెను. ఆడవారు మగవారుకూడ తయారుచేయబడుదురు ఈ నెల 15 వరకే చేర్చుకొనబడుదురు జీతము నెలకు రూ. 5/- భోజన వసతికూడ కలదు. వివరములకు:-

పాపులర్ కెమిస్ట్సు-
క ఇ, యం, హస్పిటల్ ఎదుట సికింద్రాబాదు

Printed and Published by, G. Ramakrishna Reddy at the Golkonda Power Press, Hyderabad Dn, Editor- S. Prathapa Reddy B. A.B.L.